# విస్డమ్

గౌరవసహాయసంపాదక
ఎ.బి.సాయిప్రసాద్

ఈసంచికలో
వంబరు 1994



:చందావివరాలు:
3సంవత్సరాలచందా రూ.140/-
సంవత్సర చందా రూ. 48/-
యిర్ మెయిల్(1సం॥) రూ.200/-
మెయిల్(1సం॥) రూ.100/-

:చందాపంప
రత్నాఏజన్సీస్
9,దేశికార్ రోడ్, మైలాపూర్
600004
ఫోను : 4990327

:ముఖచిత్రం:కలర్‌ట్రాన్సపరెన్సీ:
జగ్ మోహన్

# ధ్యానం

## మంచి చెడుల బలం




సత్యం ఆధిపత్యంలో గల నమ్మకం మనిషిని పొరబాటు నుండి రక్షిస్తుంది. పరిపక్వత పట్ల మనకున్న విశ్వాసం మనల్ని పాపం నుండి రక్షిస్తుంది. మంచి యందు గల నమ్మకం మనుషులను చెడునుండి రక్షిస్తుంది. ప్రతి నమ్మకం మన జీవితంతో ముడిపడి ఉన్నదన్న సత్యం తానుగా ఋజువవుతుంది. పాపంతో నిండిన స్వభావంతో జీవితాన్ని కొనసాగిస్తున్నంత కాలం ధర్మ శాస్త్రాలలో మనకున్న నమ్మకాన్ని గురించి తెలుసు కోవలసిన అవసరం ఉండదు. కారణం అది లెక్కలోకి రాదు. మనం అడగ వలసినదంతా ఇదే: "మనిషి తన జీవితాన్ని ఎలా గడుపుతున్నాడు?"

(మిగతా 3 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## సొగసు

సొగసుగా పనులు చేసే నేర్పు కొందరి లోనే ఉంటుంది ఈ నేర్పు ఒక వరంతో సమానం వారు చేసే ప్రతి పనిలోను సొగసును, అందాన్ని మనం తప్పక చూడ గలం. వారి పనులలో కనబడే సొగసుకు వింత శోభ ఉంటుంది. ఇదే వారి ప్రత్యేకత

బుద్ధికి సద్వివేకం ఎంత అవసరమో మానవ శరీరానికి సొగసు అంతే అవసరం. సొగసు గల ముఖంలో ఆశ తళతళలు స్పష్టంగా కనబడతాయి అతని ముందు ఖచ్చితమైన లక్ష్యం ఉంటుంది. నిజంగా ఆచరణ యోగ్యమైన ఆదర్శాలు కూడా అతడి ముందు ఉంటాయి. పనులను తను త్వరగానూ, చురుకుగానూ చేయగలడు. తన భావాలను, తన ప్రణాళికలను ఇతరులకు సులభంగా నచ్చచెప్పి వారిని ఒప్పించగలడు. తన శక్తిని, ఉత్సాహాన్ని అతడు అతి మెళకువగా వాడుకోగలడు. ఒక పనిని పూర్తి చేయాలనుకున్నప్పుడు అతన్ని మించిన యోగ్యుడైన వ్యక్తిని, విశ్వాస

## ఆసియాలో అధికంగా పొగత్రాగేవారు

ఆసియాలో అధికంగా పొగత్రాగేవారు - చైనీయులు. ఆసియా - పసిఫిక్ ప్రాంతంలో 1.66 ట్రిలియన్ సిగరెట్ల వినియోగంలో చైనా సగభాగం ఉపయోగించుకుంటుంది

"మహాత్మాగాంధీ మానవాళి అంతరాత్మకు ప్రతిరూపం."

—జార్జి మార్షల్

పాత్రుడైన వ్యక్తిని మనం చూడలేము. సొగసుతనం లేని వ్యక్తికంటే ఇతను కార్యాన్ని త్వరగా సాధించగలడు.

సాధారణంగా సొగసు అన్నది కొందరి స్వభావంలోని భాగమే, చాలా చిన్న వయసులో సొగసు వారికి అబ్బుతుంది.







సొగసును పొందడం అన్నది కష్టతరమైన పని కాదు నిజం చెప్పాలంటే సొగసును మాటలలో పనులు చేసే తీరులో, సహజంగా చేసే పనులలో, అన్నింటికి మించి సున్నితమైన సభ్యతలో చూడగలం.

మనం చేసే ప్రతి పనిని అందంగాను, సొగసుగాను చేయవచ్చును. ఉత్తమ శ్రేణి సొగసును మనం అలవాటు చేసుకోగలగాలి. మనం రోజు చేసే పనులను - బూట్లను పాలీసు చేయడం, పుస్తకాలను లేదా గుడ్డలను అందంగా అరల్లో అమర్చడం, పని చేసే చోటుకు కావలసిన వస్తువులను తీసుకు పోవడం మొదలైన వాటిని అందంగాను, సొగసుగాను చేయాలి.

సొగసుగా పని చేసేందుకు ప్రయత్నించినప్పుడు ఆ పని సులభంగాను, తక్కువ ప్రయాసతోనూ మనం చేయగలుగుతాము. ఇలాంటి గుణమున్న వారికోసం ఉద్యోగాలు వెతుకుతుంటాయి ఇతరులు వీరిని చూచి నేర్చుకోవాలి.

ఏ రంగంలోనైనా పరిపక్వతకున్న స్థానం సొగసు తరువాతనే. ఈ అసాధారణ సుగుణం లేనివారు తమ జీవితాన్ని సుఖ సంతోషాలతో గడపలేరు. హృదయ సామరస్యం బహిర్ రూపమే సొగసు అన్న సంగతి మరిచిపోకండి

## అతి విశాలమైన భూగర్భ సరస్సు

*ప్రపంచంలోని అతి విశాలమైన భూగర్భ సరస్సు నైఋతి ఆఫ్రికాలోని ఉత్తర నమీబియా సమీపంలో ఉంది ఈ సరస్సు విస్తీర్ణత 15 హెక్టార్లు లోతు 200 మీటర్లు అన్వేషకులు ఒక గుహ లోపలికి వెళ్ళారు అక్కడ భూమట్టానికి 59 మీటర్ల అడుగున నున్న ఈ సరస్సును వారు కనుగొన్నారు*

( 2 వ పేజీ తరువాయి)

కష్టాల్లో చిక్కుకున్నప్పుడు మనిషి ఎలా వ్యవహరిస్తున్నాడు?'' పై ప్రశ్నలకు మనం ఇచ్చే జవాబే మనం మంచికున్న బలాన్ని విశ్వసిస్తున్నామా లేదా చెడుకున్న బలాన్ని విశ్వసిస్తున్నామా అని ఎత్తి చూపగలదు.

''అణకువ, సూటిగా చెప్పే నిజం, సామ్రాజ్యాల కంటే శక్తిమంతమని నిరూపించిన మానవోత్తముడు - మహాత్మాగాంధీ.'' —వాన్‌డెన్‌బర్గ్

# రేడియో పేజింగ్

టి. నారాయణమూర్తి

చీఫ్ జనరల్ మేనేజర్, తమిళనాడు టెలికం
సర్కిల్ మద్రాసు

''సునీల్! నీవు ఎక్కడున్నానరే తూర్పు ద్వారాన్ని వెంటనే చేరు. మీ నాన్నగారు నీ కోసం అక్కడ కాచుకున్నారు.'' ఇటువంటి ప్రకటనను జనం బాగా గుమి కూడిన సభల్లో మీరు తరచుగా వింటుంటారు. ఈ విధంగా పిలవడం చాలా రోజులుగా మన దేశంలో సాధారణంగా ఉపయోగంలో ఉన్న పేజింగ్ అన్న విషయాన్ని మనం ఊహించలేదు.


GUGLIELMO MARCONI

విద్యార్థులు మైక్రోఫోను ద్వారా తమ స్కూలు ప్రధాన అధ్యాపకుడు తమతో మాట్లాడటం విని ఉంటారు. ఒక్కోసారి పాఠశాల ప్రధాన అధ్యాపకుడు వెంటనే ఆ పాఠశాల ఫిజికల్ ఇన్‌స్ట్రక్టర్‌ను చూడాలను కుంటారు. అప్పుడు పబ్లిక్ స్పీకింగ్ సిస్టమ్ ద్వారా ఆ సందేశాన్ని, డ్రిల్లు మాస్టరుగారు ఎక్కడున్నా సరే అందజేయ గలుగుతారు. ఆ పిలుపు అందుకుని అతను ఆలస్యం చేయకుండా ప్రధాన అధ్యాపకుణ్ణి వారి గదిలో కలుస్తారు. మనుషులు ఎక్కడ ఉన్నారో తెలుసుకుని వారి వరకు సందేశాన్ని అందజేయడాన్ని రేడియో పేజింగ్ (సందేశాలను అంద జేయడం) అంటారు. పాఠశాలలో ఈ పద్ధతిని శ్రవణం ద్వారా సాధిస్తారు సందేశం చేరవలసిన స్థలం విశాలమైన నగరం అయినప్పుడు పైన చెప్పిన మార్గంలో అది అసంభవం. మనం సులభంగా ఆచరణలో పెట్టగల, ఫలితాల్ని సాధించ గల ఇతర మార్గాన్ని వెతుక్కోవాలి. రేడియో పేజింగ్ ద్వారా పైపని సులభంగా నెరవేర గలదు.

## అతి ప్రాచీన కాలువల అవశేషాలు

*పురావస్తు శాస్త్రజ్ఞులు 1968 లో క్రీ.పూ 5000 సంవత్సరాలనాటి ప్రాచీన కాలువల అవశేషాలను కనుగొన్నారు. ఈ అవశేషాలను ఇరాక్ (పశ్చిమ ఆసియా) కు చెందిన మాన్‌డలీ (Mandali) దగ్గర కనుగొన్నారు.*

''ఉద్గ్రంథాలలోని ఆనందానుభూతిని వెలికి తీయగలిగినవాడే సద్విమర్శకుడు.''
—అనటోల్ ఫ్రాన్స్

మొదట్లో పేజింగ్ పనిని శ్రవణ దృశ్య సాధనాల ద్వారా చేసేవారు. వైర్ల ద్వారా మొత్తం భవనాన్ని కలిపి మైక్రోఫోను సహాయంతో మనిషిని వెతికి పట్టుకోవడం ఇంతకు ముందు జరిగేది. ఈ పద్ధతి బాగా ప్రచారంలో కూడా ఉండేది. ముఖ్యంగా పెద్ద పెద్ద ఆసుపత్రులలో డాక్టర్ల అవసరం ఏర్పడినప్పుడు వారి వద్దకు సందేశాన్ని పంపేందుకు ఈ పద్ధతిని వాడుతూ ఉండేవారు.

**RADIO PAGING**







పాతకాలం పేజింగ్‌లో ఒక పద్ధతి ఉండేది. ఫలానా మనిషి అవసరం ఉంది అన్న సమాచారాన్ని అందజేస్తారు. ఆ సందేశాన్ని విన్న ఆ వ్యక్తి దగ్గరిలో ఉన్న టెలిఫోను వద్దకు పోయి నిర్ధారింపబడిన సంకేతం సహాయంతో అవతల్వి వారితో వెంటనే మాట్లాడేవారు. ఒక ముఖ్యమైన సందేశాన్ని ఎక్కువగా ప్రసారం చేసి కావల్సిన వ్యక్తిని కావలసిన చోటుకు త్వరగా రప్పించడమే పాత కాలపు పేజింగ్ ముఖ్య ఉద్దేశం.

1930లో రెండు అద్భుతాలు జరిగాయి అందులో మొదటిది థెర్‌మియోనిక్ వాల్వ్ (Thermionic Valve) ఆవిష్కరణం రెండవది గుగ్‌లియెల్మో మార్కోని (Guglielmo Marconi) కనుగొన్న తంతులు లేని వార్తలు పంపే యంత్రం. ఈ యంత్రం కారణంగా అట్లాంటిక్ గుండా తంతి వార్తలను చేరవేయడం జరిగింది. ఈ రెండింటి వలన రేడియో పేజింగ్ ఉదయించింది.

తంతులు లేకుండా వార్తలను పోలీసు వారు ఒక చోటి నుండి మరో చోటికి అందజేసేవారు. ఇది మనకు తెలిసిన విషయమే. ఈ సదుపాయాన్ని విమాన స్థావర అధికారులూ, రవాణాను తిరిగి పొందే పద్ధతికి విరివిగా వాడేవారు. పైన చెప్పిన రంగాలలో పేజింగ్ అన్నది రెండు వైపుల సంభాషించుకోవడానికి పనికి వస్తుంది. కాని రేడియో పేజింగ్‌లో అలా జరగదు.

రేడియో పేజింగ్ సాధారణంగ టెలికాం అల్లికకు జత చేయబడుతుంది. ఈ సౌకర్యం కలిగిన వ్యక్తులు వారు దేశ విదేశాల్లో ఎక్కడున్నా - గుజరాత్‌లోని బరోడ

## నమ్మకమే అతి గొప్ప స్నేహితుడు

*ఆరోగ్యమే మహాభాగ్యం. తృప్తికి మించిన ఖజానా లేదు నమ్మకం కంటే గొప్ప స్నేహితుడు లేడు. విడుదలకు మించిన గొప్ప ఆనందం లేదు.*

— ధమ్మపాద

"కుడిచేతితో ఇచ్చే దానం ఎడమ చేతికి తెలియకూడదు."

లేక బెల్జియంలోని బ్రుస్సెల్స్ - వారికి మనం సందేశం ఇవ్వవచ్చును.

రేడియో పేజింగ్ పద్ధతి విశాల ప్రసార అవకాశాలను కలుగజేస్తుంది. కారణం ఇది నగరంలోని అనేక ట్రాన్స్మీటర్లకు జత చేయబడి ఉంటుంది. ప్రతి వాడుక దారుడికి రేడియో లాంటి రిసీవర్

RADIO PAGING





యంత్రాన్ని ఇస్తారు. చందాదారుడి పేర సందేశం వస్తే ఆ సందేశాన్ని మొట్టమొదట రిసీవర్ యంత్రం గ్రహిస్తుంది. ఆ తరువాత చెవులకు స్పష్టంగా వినబడగలిగే 'బీప్' సంకేతాన్ని ఇస్తుంది. అప్పుడు చందాదారుడు తనకి సందేశం ఉన్నదన్న విషయాన్ని గ్రహిస్తాడు. అప్పుడు రిసీవర్‌కున్న కిటికీలో చూస్తాడు. చూచిన వెంటనే తనకు ఎవరు సందేశాన్ని అందజేసేందుకు ప్రయత్నిస్తున్నారన్న విషయం తెలిసిపోతుంది.

ఏకకాలంలో ఇద్దరి సందేశాల్ని ఈ రేడియో పేజింగ్ ద్వారా అందజేయలేము. ఇది ఒక విధంగా మనల్ని హెచ్చరించే సాధనం మాత్రమే. ఈ సౌకర్యం తీరిక లేకుండా పని చేసే ఉన్నత అధికారులకూ ఎక్కువగా ప్రయాణం చేసే సేల్స్‌మెన్లకూ తరచుగా పనులకోసం పిలువబడే వ్యక్తులకూ చాలా ఉపయోగకరంగా ఉంటుంది.

రేడియో పేజింగ్ మెషిన్ సరసమైన ధరకు దొరుకుతుంది. పేజ్ చందాదారుడు ఒక నిర్ణీత పరిధిలో ఎక్కడకు కావల్సి వస్తే అక్కడకు వెళ్ళవచ్చు. రేడియో ప్రసారణ ద్వారా సులభంగానూ, ఆచరణయోగ్యమైన పద్ధతిలో సందేశాన్ని అత్యవసర పరిస్థితులలో అందజేసి సభ్యులను ముందుగానే హెచ్చరింపజేసి సంసిద్ధులను చేయవచ్చును.

గత 50 సంవత్సరాలుగా జనం ఈ రేడియో పేజింగ్ పద్ధతిని ఇష్టపడుతూ వస్తున్నారు. మొదట్లో సందేశాల్ని అందజేయవలసిన వారి సంఖ్య తక్కువగా ఉండేది. కాలం గడుస్తున్న కొద్దీ రేడియో పేజింగ్ చందాదారుల సంఖ్య దినదిన ప్రవర్థమానంగా పెరుగుతూ వచ్చింది. ఈ రోజు ప్రపంచం మొత్తంలో సుమారు 8 మిలియన్ల రేడియో పేజింగ్ చందాదారులున్నారు. వారికి మనం ప్రస్తుతపు టెలిఫోను అల్లిక ద్వార సందేశాన్ని చేరవేయవచ్చును.

రేడియో పేజింగ్, ఇటలీకు చెందిన ఎలక్ట్రికల్ ఇంజనీరు గుగ్లియెల్మో మార్కోనికు ఎంతో ఋణపడి ఉంది. రేడియో వేవ్స్‌ను అతను మొట్టమొదట కనుగొన్నాడు. ఆ తరువాత అంటెన్నా (Antennae)ను అలలను పొందడానికి,

"కావలసిన దానికన్నాఎక్కువ ప్రోగుచేసుకుని దాచి పెట్టుకోవడంపాపం."

పంపడానికి ఎలా ఉపయోగించాలో కూడా కనుగొన్నాడు. ఆ కారణంగా ఆధునిక ప్రసారణ అభివృద్ధి పొందింది. 1901, డిసెంబర్ నెల 12వ తారీఖున మార్కొని మొట్టమొదటిసారిగా ఇంగ్లండులోని కార్న్‌వాల్ (Cornwall) నుండి ఉత్తర అమెరికాలోని న్యూఫౌండ్‌లాండ్ (New foundland)కు అట్లాంటిక్ గుండా రేడియో సంకేతాల్ని పంపాడు. తరువాత మార్కొని బాగా అభివృద్ధి గాంచిన రేడియో కమ్యూనికేషన్లకు కావల్సిన సాధనాల్ని తయారు చేసాడు. ఈ సాధనాలలో రేడియో టెలిఫోన్లు, వాణిజ్య ట్రాన్స్‌మీటర్లు కూడా ఉన్నాయి.

బొంబాయి, ఢిల్లీ నగరాలలో ప్రస్తుతం ఈ రేడియో పేజింగ్ సౌకర్యం అందుబాటులో ఉంది. ఈ రోజు వరకు ఈ రెండు మహా నగరాలలో 3,000 మంది ఈ సౌకర్యాన్ని గలిగి ఉన్నారు. ఈ సౌకర్యాన్ని మన దేశంలోని ఇతర ముఖ్య పట్టణాలకు కూడా విస్తరింపజేసే ప్రణాళికలు తయారు కాబడుతున్నాయి. సంవత్సరానికి 450 రూపాయల బాడుగ ఈ రిసీవర్ యంత్రానికి గాను ప్రస్తుతం వసూలు చేస్తున్నారు. ఈ బాడుగను కాక యంత్రాన్ని పొందే ముందు 11,000 రూపాయల తిరిగి ఇవ్వగల డిపాజిట్ కూడా కట్టవలసి వస్తుంది.

విమానాల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు, రైలు లేక బోటులో ప్రయాణం చేస్తున్నప్పుడు సంప్రదించబడాలని చందాదారులు ఇష్టపడతారు. సెల్యులార్ మొబైల్ కమ్యూనికేషన్ (Cellular Mobile Communication) అన్నది సందేశాన్ని అందజేసేందుకు ఉపయోగింపబడుతున్న మరో శ్రేష్ఠమైన పద్ధతి రేడియో టెక్నాలజీని ఇంకా ఆచరణ యోగ్యమైన మార్గంగా గుర్తించి వాడుతున్నారు. రేడియో పేజింగ్ మరియు సెల్యులార్ మొబైల్ కమ్యూనికేషన్ రెండూ ఇటీవల పెంపొందింపబడిన రేడియో ఫ్రీక్వెన్సీలపై ఆధారపడి ఉన్నాయి. ఇది నిజంగా ఏ పరిపాలనా రంగానికైనా చాలా అరుదుగా దొరికే వాణిజ్య వస్తువు.

## ఆలోచింపచేసే సంఘటన

### గడియారం వైపు చూడకు




*ఒకసారి ఒక పెద్దమనిషి థామస్ ఆల్వా ఎడిసన్‌గారిని మెన్‌లో పార్క్ (Menlo park) వద్ద కలిసాడు. వ్యాపారంలో ప్రవేశింపబోతున్న తన కొడుక్కి ఒక సందేశానిమ్మని కోరాడు. ఆ గొప్ప సృష్టికర్త వెంటనే: "అయితే సరే గడియారం వైపు చూడకు అన్న వాక్యాన్ని ఆదర్శంగా ఉంచుకోమనండి" అని జవాబిచ్చాడు.*

"సత్యం, జ్ఞానం, ధర్మం, దయ, శాంతి, క్షమ - ఈ ఆరే ఆప్తులైన బంధువులు."

# ...హార ఔషధమూ సౌందర్య సాధనమూ అయిన పీచ్

డా. హెచ్.కె. బఖ్రూ

పీచ్ (దొండపండు లాంటి ఎర్ర రంగు గల శప్తాలు పండు) ప్రపంచంలోని పండ్లలో అతి రుచికరమైన పండు. పీచ్ సమశీతోష్ణ ప్రాంతాలకు (ఎక్కువ ఎండా లేదా ఎక్కువ చలిలేని ప్రాంతం) చెందిన పండు. దీని ముఖ్యవిలువ సువాసనలోనే ఉంది.



Peach

ఈ పండు గుజ్జు మెత్తగాను, పెళుసుగాను ఉంటుంది. ఈ గుజ్జులో నీరూ, పొటాష్ (బూడిద ఉప్పు) శాతం ఎక్కువగా ఉంటుంది. గుజ్జురంగు తెలుపు, పసుపు లేక ఎరుపు రంగులో ఉంటుంది. గుజ్జు సాధారణంగా పండు టెంకకు అతుక్కుని ఉంటుంది. మధ్యరకం ఎత్తుకు ఎదిగిన చెట్టుకు ఈ పండ్లు కాస్తాయి. తియ్యటి వాసన గలిగిన లేత గులాబీరంగు పూలు ఈ చెట్టుకు పూస్తాయి.

చైనా దేశం ఈ చెట్టుకు మాతృదేశంగా పరిగణింపబడుతోంది చైనాలో ఈ పండు 2000 సంవత్సరాల క్రిందటే సాగుబడిలో ఉన్నట్లు ఆధారాలున్నాయి చాలా శీఘ్రంగా ఈ పండు టర్కీస్థాన్, భారత దేశపు వాయవ్యప్రాంతం, పర్షియా (నేటి ఇరాన్), రోమ్ దేశాలకు వ్యాపించింది. ప్రస్తుతం ఈ పండును యూరప్ ఖండం లోనూ, దక్షిణ అమెరికాలోనూ, సంయుక్త రాష్ట్రాల అమెరికాలోనూ, దక్షిణ ఆఫ్రికాలోనూ, ఆసియా ఖండపు సమశీతోష్ణ మండలాల లోను, ఆస్ట్రేలియాలోనూ పండిస్తున్నారు.

ప్రయోగశాలలో ఈ పండును శాస్త్రజ్ఞులు పరిశీలించారు. ఈ పరిశీలన ప్రకారం తినగలిగిన ప్రతి నూరు గ్రాములలోనూ, 86.0 శాతం తేమ, 1.2 శాతం మాంస కృత్తులు, 0 3 శాతం కొవ్వు, 0.8 శాతం ఖనిజాలు. 1.2 శాతం నార, 10.5 శాతం

## ఇంగ్లీషు అక్షరమాల (Alphabet) లోని J & V అక్షరాలు

*షేక్స్‌పియర్ అనంతరం క్రీ.శ. 1630 మొదలు ఇంగ్లీషు అక్షరమాల లోని జె (J) & వి (V) అక్షరాలను మొట్ట మొదటిసారి విరివిగా వాడడం మొదలు పెట్టారు.*

'మన్నించడం మంచిది. మర్చిపోవడం మహా మంచిది.''

కార్బోహైడ్రేటులు (పిండి పదార్థాలు) ఉంటాయని నిర్ధారించారు. ప్రతినూరు గ్రాములకు ఈ పండులో మనకు కావలసిన ఖనిజాలు, విటమిన్లు విరివిగా లభ్యమవుతున్నాయి. వాటి వివరాలు: 15 మిల్లీ గ్రాముల శాతం కాల్షియం (లవణం), 41 మిల్లీగ్రాముల శాతం పాస్పరస్ (భాస్వరం), 2.4 మిల్లీ గ్రాముల శాతం ఇనుము, 0.02 మిల్లీగ్రాముల శాతం థయామిన్ (Thiamine), 0.5 మిల్లీగ్రాముల శాతం నియాసిన్ (Niacine), 0.03 మిల్లీగ్రాముల శాతం రిబోఫ్లావిన్ (Riboflavin), 6 మిల్లీ గ్రాముల శాతం 'సి' విటమిన్ ఈ పండు కాలరోఫిక్ (Colorific) ఉష్ణత విలువ 50గా పరిగణింపబడుతోంది.

ప్రాచీనకాలం నుండి ఈ పీచ్ పండును ఆహార ఔషధంగా మనం వాడుతూ వస్తున్నాము. డియోస్కోరైడ్స్ (Dioscorides) అనబడే గ్రీకు వైద్యుడు ప్రకారం రోజుకొక పీచ్ మనం తింటే మన శరీరంలోని భాగాలను అది శుభ్రపరచగలదు. ఇది శరీరం రంగును, కాంతిని కూడా ఎక్కువ చేయగలదు. ఈ పండు కడుపును బలపరచి దాని పనిని ప్రోత్సహించగలదు. చర్మానికి అమత్వ చముకం (Mucous Membrane) శీతలత్వాన్ని ప్రసాదించగలదు. తాజాపండ్లు, కూరగాయలు తిననందువల్ల గలిగే స్కర్వీ వ్యాధిని నిరోధించడానికి, ఆ వ్యాధినివారణకు ఈ పండు ఉపయోగపడుతుంది. ఈ చెట్టు బెరడు, ఆకులు, విత్తుల నూనె మొదలైన వాటిని ఈ రోజు మందుల తయారీకి విరివిగా వాడుతున్నారు. నేడు మనకు లభ్యమయ్యే నిద్రమాత్రలు, మూత్రం తయారీని అధికం చేయగల మాత్రలు, లాలాజలాన్ని పలుచపరచే మాత్రలు, మొదలైన మాత్రల తయారీకి ఈ చెట్టు భాగాలను వాడుతున్నారు.

## విస్డమ్ పాతకాపీలు

*మే '84, జూన్ '84, ఆగస్టు '84 నుంచీ నవంబరు '84, మార్చి '85 నుంచీ జూన్ '85; ఫిబ్రవరి '86 నుంచీ ఏప్రిల్ '86; సెప్టెంబరు '86 నుంచీ డిసెంబరు '86; జనవరి '87, మార్చి '87 నుంచీ మే '87, ఆగస్టు '87, డిసెంబరు '87, జనవరి '88, మార్చి '88 నుంచీ డిసెంబరు '88; జనవరి '89 నుంచీ డిసెంబరు '89; జనవరి '90 నుంచీ జూన్ '90, ఆగస్టు '90, సెప్టెంబరు '90, నవంబరు '90, డిసెంబరు '90, ఫిబ్రవరి '91 నుంచీ డిసెంబరు '91, జనవరి '92 నుంచీ డిసెంబరు '92; జనవరి '93 నుంచీ డిసెంబరు '93, జనవరి '94 నుంచీ జూన్ '94 కాపీలు మావద్ద ఉన్నవి. 1984 కాపీల వెల రూ. 7.50లు; 1985 కాపీల వెల రూ. 5.50లు, 1986 కాపీల వెల రూ. 10.50లు; 1987 కాపీల వెల రూ. 10.00లు; 1988 కాపీల వెల రూ. 18.75లు; 1989 కాపీల వెల రూ. 24.50లు; 1990 కాపీల వెల రూ 23.00లు; 1991 కాపీల వెల రూ. 26.50లు 1992 కాపీల వెల రూ. 33.00లు, 1993 కాపీల వెల రూ. 33.00లు; 1994 కాపీల వెల రూ 17.50లు; రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 6.00 చేర్చి M.O. పంపాలి. 'రత్నా ఏజన్సీస్', 9, దేశికారోడ్డు (ఆళ్వారుపేటవద్ద), మద్రాసు - 600 004*

*— సర్క్యులేషన్ మేనేజర్*

"నవ్వుతూ చేసిన పాపాల్ని ఏడుస్తూ అనుభవించక తప్పదు."

ఈ చెట్టు బెరడు లేక ఆకులతో తయారయే మందులు దగ్గును తగ్గిస్తుంది. శ్వాసనాళపు ఆమత్వచము వాపును తగ్గించి శరీరానికి విశ్రాంతిని కూడా ఈ మందులు కలుగజేస్తాయి బ్రాంకైటిస్, కుక్కదగ్గు (Whooping cough)ను బెరడులేక ఆకులతో తయారుచేయబడిన మందులు తగ్గించగలవు. ఈ మందు తయారీకి కావల్సినది 15 గ్రాముల బెరడు లేక 30 గ్రాముల ఆకులను అర లీటరు నీళ్ళలో బాగా మరిగించాలి. ఆ మందును ఒకగంటసేపు చల్లారనిచ్చి ఆ తరువాత వాడాలి. చిన్న చెంచా నిండుగా గానీ, లేదా పెద్ద చెంచానిండుగా గాని ఈ మందును వయసును దృష్టిలో ఉంచుకుని వాడాలి.

అజీర్తికి దీర్ఘకాలపు పేగుల అనారోగ్యానికి పీచ్ ఆహార ఔషధం దివ్యంగా పనిచేస్తుంది. పేగులకు కావలసిన మృదువైన కదలికను ఈ మందు ప్రోత్సహించగలదు. పీచ్‌కు నిద్రను ఆహ్వానించే గుణం ఉన్నందువల్ల గర్భిణీ స్త్రీలలో చాలా సాధారణంగా కనబడే ఉదయం అస్వస్థతను పీచ్ దూరం చేయగలదు. వాంతులను కూడా ఇది అరికట్టగలదు. పడుకోబోయే ముందు ప్రతిరోజు ఈ పీచును పైనున్న తోలుతో సహా తింటే మలబద్ధకం దూరం అవుతుంది.

ఈ పీచు తోలు దేహకాంతిని రంగును ఎక్కువ చేస్తుంది. తోలులోపలి భాగాన్ని ముఖంపై పడుకోబోయే ముందు కొన్ని నిమిషాలు మెత్తగా వొత్తుకోండి. వొత్తుకున్న తరువాత తేమను తుడుచుకోరాదు. ఈ పద్ధతి ముఖాన్ని శుభ్రపరుస్తుంది. అంతమాత్రమే కాకుండా చర్మం పైని చిన్న చిన్న రంధ్రాలలో పేరుకుపోయిన మట్టిని ఇది శుభ్రం చేయగలదు.

## ఐదుసార్లు వరుసగా టైపింగ్ ఛాంపియన్‌షిప్‌ను పొందిన మహిళ




*పిర్‌మాసేన్స్ (జర్మనీ) దగ్గరున్న రోడాల్‌బెన్ ప్రాంతానికి చెందిన నికోల్ బుస్‌చినా వరసగ అయిదుసార్లు ప్రపంచ టైపింగ్ ఛాంపియన్‌షిప్‌ను గెల్చుకుంది. ఈ మహిళ నిమిషానికి సరాసరి 800 అక్షరాలను అంటే ఒక నిమిషానికి 140 మాటల చొప్పున టైపింగ్ చేయగలదు. అతి చురుకైన వేళ్ళున్న ఈ సూపర్‌ఫాస్ట్ టైపిస్టు పై వేగాన్ని అరగంట వరకు ఎలాంటి ఇబ్బంది లేకుండా కొనసాగించగలదు.*

"మాటల కన్నా గంభీరంగా మాట్లాడుతుంది - మౌనం."

# మనరాష్ట్రాలు

## కర్ణాటక

జన సంఖ్య, విస్తీర్ణత దృష్ట్యా దక్షిణ ప్రాంతానికి చెందిన కర్ణాటక రాష్ట్రం భారత దేశంలో ఎనిమిదవ స్థానంలో ఉంది. 'కరునాడు' మాట ఆధారంగా కర్ణాటక అన్నమాట ఏర్పడినట్లు భాషా శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఈ మాటకు అర్థం చాలా ఎత్తైన ప్రాంతం అని. నిజంగానే ఈ రాష్ట్రం ఎత్తైన పీఠభూమికి చెందిన రాష్ట్రం. ఈ రాష్ట్రం దక్షిణ పీఠభూమికి




పడమటి అంచుల్లో ఉంది. ఈ రాష్ట్రం పడమటి ఎల్ల అరేబియా సముద్రం. సుమారు 300 కి.మీ.ల పొడవున్న కోస్తా ప్రాంతం ఈ రాష్ట్రంలో ఉంది. ఈ రాష్ట్రం గుండా రెండు గొప్ప నదులు ప్రవహిస్తున్నాయి ఈ రాష్ట్రానికి ఉత్తరాన కృష్ణ, దక్షిణాన కావేరీ నదులున్నాయి.

ఈ రాష్ట్రం విస్తీర్ణత, 1,91,791 చ.కి.మీ.లు. రాష్ట్ర జనాభా 44,817,398 సుమారు 76శాతం జనాభా గ్రామ ప్రాంతాలలో నివసిస్తున్నది. ప్రతి చదరపు కిలో మీటరుకు 234 మంది చొప్పున నివసిస్తున్నారు ప్రతి 1000 మంది పురుషులకు 960 స్త్రీలు ఉన్నారు. అక్షరాస్యత సుమారు 56 శాతం ఉంది. ఈ రాష్ట్ర ప్రజల తలసరి ఆదాయం 4075 రూపాయలు

కర్ణాటక అతి రమణీయమైన చరిత్ర గల రాష్ట్రం. 2000 సంవత్సరాల చరిత్ర ఈ రాష్ట్రానికి ఉంది. ప్రాచీన కాలంలో ఈ ప్రాంతాన్ని కుంతల దేశంగా పిలిచేవారు. ఇక్కడివారి వాణిజ్యం ఈజిప్టు దాకా వ్యాపించి ఉండేది. సుమేరియన్లతోనూ, ఫోనీషియన్లతోనూ వీరికి వ్యాపార పరమైన సంబంధాలుండేవి. గొప్ప వంశాలకు

## భారతదేశంలో మొదటి చమురు బావి

*1889, అక్టోబరు నెల 18 వ తారీఖున అస్సాంలోని డిగ్‌బాయ్ (Digboi) లో మనదేశపు మొట్టమొదటి చమురుబావి కనుగొనబడింది ఇంతవరకు త్రవ్విన 1001 బావులలో 700 బావుల్లో ఇప్పటికి మంచి పరిమాణంలో చమురు విరివిగా లభిస్తోంది.*

"నీ కోపాన్ని నీవు జయిస్తే, మిగిలినవన్నింటిని నీవు జయిస్తావు."

చెందిన - మౌర్యుల మొదలు ఒడయార్ల దాకా - రాజులు ఈ రాష్ట్రాన్ని సుభిక్షంగా పరిపాలించి కళ, మతం, సాహిత్యంల పరివ్యాప్తికి పాటుపడ్డారు.



మైసూరు మహారాజు పాలనలో ఈ రాష్ట్రం ఎంతో ప్రగతిని సాధించింది. నేటి కర్ణాటకలోని చాలా భాగాలు ఆనాటి మైసూరు సంస్థానం పరిపాలనలో ఉండేవి. దూరదృష్టి చక్కటి పరిపాలనా దక్షత గలిగిన దీవాన్లు - సర్వశ్రీ డా. మోక్షగుండం విశ్వేశ్వరయ్య, సర్ మీర్జాఇస్మాయిల్, కె శేషాద్రి అయ్యర్, మాధవరావు - ఈ సంస్థానాన్ని ఒక ఆదర్శ సంస్థానంగా తీర్చి దిద్దారు. అప్పుడు పరిపాలిస్తున్న వొడయార్ వంశీకులు ఈ సంస్థానాన్ని పారిశ్రామిక కేంద్రంగా కూడా మార్చారు. ఈ సంస్థానం సాంస్కృతిక పురోభివృద్ధికి ఒడయార్లు ఎంతో కష్టపడ్డారు. 1947 తరువాత, అంటే మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సంయుక్త మైసూరు రాష్ట్రాన్ని 1956లో ఏర్పరిచారు. మైసూరు రాష్ట్రం పేరును కర్ణాటకగా1 973లో మార్చారు.

కర్ణాటక రాష్ట్రంలో రెండురకాల సభలున్నాయి. ఈ రాష్ట్ర అసెంబ్లీలో 224 మంది సభ్యులు, కౌన్సిల్‌లో 75 మంది సభ్యులున్నారు.

ఈ రాష్ట్రంలో 20 జిల్లాలున్నాయి.

ఇక్కడి ప్రజల ప్రధాన భాష కన్నడం. ఇక్కడి ప్రజలు తెలుగు, మరాఠీ, కొడగు, కొంకిణి, తుళు, ఉర్దూ, తమిళం, సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు మొదలైన భాషలను మాట్లాడుతారు.

మత సామరస్యానికి బేలూరులోని హొయసల మందిరం ఒక చక్కటి ఉదాహరణ ఇక్కడ బౌద్ధులు, జైనులు, శైవులు కలిసి సంఘీభావంతో ప్రార్థనలను చేశారు.

ఈ రాష్ట్రం విస్తీర్ణతలోని 16 శాతం భూమి అడవులతో కూడుకున్నది. పడమటి కనుమలు కోస్తా ప్రాంతానికి సమాంతరంగా ఉంటాయి. ఆ కారణంగ

## తాతా ఊతునా!

*తెనాలి రామలింగడు ఒకసారి తాతాచార్లగారి దర్శనానికి పోయాడు. ఆ సమయంలో వారు ఉయ్యాలలో హాయిగా ఊగుతున్నారు. ఉయ్యాల గతి మందగించటం చూసి రామలింగడు 'తాతా ఊతునా?' అని అడగటం, రామలింగడి స్వభావం తెలిసిన తాతాచారికి ఏం జవాబు ఇవ్వాలో తెలియక జుట్టు పీక్కోవడం ఒకసారి జరిగాయి*

"ఇతరులకు నీవేమి ఉపదేశిస్తావో దానిని మొదట నీవు ఆచరించు."

ఇక్కడ చిక్కటి అడవులున్నాయి. ఈ అడవుల్లో, టేకు, చందనం, వెదురు, రోస్‌వుడ్, రకాలకు చెందిన మేలుజాతి కలప విస్తృతంగా లభిస్తుంది. ఈ రాష్ట్రానికి చెందిన 'చందనం'కు ప్రపంచం మొత్తంలో

Bangalore (Karnataka)



మంచిపేరు ఉంది. ఆ కారణంగా ధర కూడా ఎక్కువ పలుకుతుంది. ఇక్కడి వారు చందనాన్ని 'సువాసన గల బంగారు'గా భావిస్తారు. అడవుల వల్ల మనకు లభ్య మవుతున్న రాబడి దృష్ట్యా ఈ రాష్ట్రానికి మన దేశం రాష్ట్రాలలో రెండవ స్థానం లభిస్తుంది. 71 శాతం శ్రామికులు వ్యవసాయం మరియు తత్సంబంధమైన వృత్తులలో ఉన్నారు. ఈ రాష్ట్రపు రాబడిలో 49 శాతం రాబడి వ్యవసాయం మరియు తత్సంబంధమైన వృత్తుల ద్వారానే లభిస్తుంది. మనదేశంలో లభిస్తున్న అధిక భాగం చందనం, ఈ రాష్ట్రంలో ఉంది. మనకు కావలసిన 10 శాతం చేపలు సరఫరా, 59 శాతం కాఫీ విత్తులు, 47 శాతం రాగులు, 53 శాతం శిల్కు ఈ రాష్ట్రంలో లభిస్తున్నది. ఒక హెక్టారుకు అధిక కాఫీ దిగుబడి ఈ రాష్ట్రంలోనే మనం చూడగలం. పొగాకు, ఏలక్కాయలు, వక్కలు, టెంకాయలు, జీడిపప్పు, వేరు శనక్కాయలు, పొద్దుతిరుగుడు పువ్వులు, మిరప మొదలైనవి ఇక్కడి వాణిజ్య పంటలు.

బియ్యం, రాగి, జొన్నలు, మొక్కజొన్నలు, సజ్జలు, పప్పు ధాన్యాలు ఇత్యాదులు కర్ణాటక రాష్ట్రపు ప్రధాన పంటలు. మామిడి, జామ, నారింజ, అరటి మొదలైన పండ్లు కోస్తా ప్రాంతాలలో విస్తృతంగా పండుతాయి.

రబ్బరు తోటలను కూడా భారీ యెత్తున ఇక్కడ పెంచుతున్నారు.

బంగారు, రాగి, వెండి, గ్రానైటు మేలురకం ముతక ఇనుము, టిటానియం, మాంగనీసు, మొదలైన ధాతువుల గొప్ప నిక్షిప్తాలు (గనులు) ఈ రాష్ట్రంలో ఉన్నాయి. ఒరిస్సా తరువాత కర్ణాటకలోనే కీలకమైన ఖనిజ క్రోమైటు ఉత్పత్తి జరుగుతున్నది. కర్ణాటకాకు చెందిన గ్రానైటుకు ప్రపంచంలో మంచి పేరు, గిరాకీ ఉంది. సుమారు 1000 మిలియన్ టన్నుల గ్రానైటు నిలువలు

## సంగీతం అంటే చెవులు కోసుకునే పూలు

*గ్రేట్ బ్రిటన్‌కు చెందిన ఆంథోని హక్స్‌లే: పూలు సంగీతం అంటే చెవులు కోసుకుంటాయని నమ్మేవ్యక్తి. తన తోటలో పూల మొక్కల మధ్య నాట్యం చేసి, ఒక భారతీయ నర్తకీమణి పూలు త్వరగా వికసించడానికి తోడ్పడింది.*

"సదా ఆత్మవిచారణ చేస్తూ, నీలోని తప్పులను ఏరిఏరి త్యజించు."

ఈ రాష్ట్రంలో ఉన్నట్టు భావించ బడుతూంది. మన దేశంలో బంగారు గనులు ఉన్న రాష్ట్రం కర్ణాటక ఒక్కటే. కోలారు, హుట్టి గనులనుండి ప్రతి సంవత్సరం 2,000 కి.గ్రా.ల బంగారాన్ని త్రవ్వి తీస్తున్నారు.


Vidhana Soudha, Bangalore

పరిశ్రమల రంగంలో కూడా కర్ణాటక ముందంజ వేసింది. జాతీయ ఉత్పత్తిలో నాలుగుశాతం ఉత్పత్తి ఈ రాష్ట్రంలో జరుగు తుంది. భద్రావతిలోని ఉక్కు కర్మాగారంలో ప్రత్యేకమైన ఉక్కుతో పాటు, మిశ్ర ఉక్కు Alloy Steel), ఫెర్రో సిలికాన్‌లు (లోహరాయి) తయారవుతున్నాయి. మరో మహత్తరమైన పరిశ్రమ కుద్రేముఖ్‌లో నెలకొల్పబడిన కుద్రేముఖ్ ముతక ఇనుము కర్మాగారం. ఎలక్ట్రానిక్ ఉపకరణాల తయారీలో కర్ణాటక రాష్ట్రం ప్రథమ స్థానంలో ఉంది. భారతదేశపు 'ఎలక్ట్రానిక్ నగరం'' అన్నది ఈ రాష్ట్ర రాజధాని బెంగళూరుకు మరో పేరు.

గోఖక్ జలపాతం సహాయంతో 1887లో మొట్టమొటిసారిగా మనదేశంలో విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేశారు ఈ రాష్ట్రంలో ప్రధాన విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాలు మూడు ఉన్నాయి. అవి; శివసముద్ర హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు (1901), శరావతి హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్ట్, కాళి నదిపైన నిర్మించ బడిన పవర్ ప్రాజెక్ట్. ఇవి కాక మరో రెండు థర్మల్ స్టేషన్లు (బొగ్గు సహాయంతో విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడం) రాయచూర్ లోనూ, బెంగళూరు నగరానికి సమీపంలో ఉన్న యెలహంకాలోను ఉన్నాయి. కార్వార్ సమీపంలోని కైగా (Kaiga) లో అణుశక్తి కేంద్రం రానున్నది. ప్రస్తుతపు లెక్కల ప్రకారం ఈ రాష్ట్రానికి 2,529 మెగావాట్ల విద్యుచ్ఛక్తి తయారు చేయగల సామర్థ్యం ఉంది.

ప్రభుత్వ భవనాలలో రాష్ట్ర రాజధానికి చెందిన 'విధాన్ సౌధ'కు ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. ఇది 5 అంతస్తులు అతి భవ్యమైన నవీన కట్టడం. అనాదిగా వస్తున్న హైందవ వాస్తుకళ అంశాలను జోడించి కట్టబడిన కట్టడం ఈ ''విధాన్ సౌధ.'' ఈ భవనంలో ప్రభుత్వ సెక్రటేరియెట్ శాఖలతో పాటు అసెంబ్లీ సమావేశాలకు అనువైన హాళ్ళు కూడా ఉన్నాయి. పరిశోధన దృష్ట్యా పరిశీలించినప్పుడు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ ప్రపంచ వ్యాప్తంగా మంచి పేరున్న సంస్థ. ఇక్కడి లాల్ బాగ్ ఆసియా ఖండంలో ఉన్న పూలతోటలలో శ్రేష్ఠమైన తోటగా పరిగణింప బడుతూంది. వైజ్ఞానిక, సాంకేతిక, పరిజ్ఞానం పరిశ్రమల ప్రజల అభివృద్ధికి ఎలా తోడ్పడ గలదో సూచించే సంస్థ పేరు

శ్రీ విశ్వేశ్వరయ్యా ఇండస్ట్రియల్ అండ్ టెక్నలాజికల్ మ్యూజియం. ఈ రాష్ట్రపు సర్వశ్రేష్ఠ ఇంజనీరింగ్ నిపుణుడు, రాజనీతి దురంధరుడు అయిన 'భారత రత్న' శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య పేరిట వెలసిన సంస్థే ఈ మ్యూజియం



బెంగళూరుకు 139 కి.మీ.ల దూరంలో ఉన్న మైసూరు పట్టణంలో మైసూరు మహారాజు గారి భవ్య భవనాలు ఉన్నాయి సౌందర్యాన్ని, భవన నిర్మాణ కళను పుణికి పుచ్చుకున్న భవనాలుగా ఇక్కడి భవనాలు చూపరులను ఆకట్టుకుంటాయి. మైసూరుకు 14 కి.మీల దూరంలో ఉన్న చాముండి కొండలు ఇక్కడ చూడవలసిన స్థలాలలో ఒకటి. ఈ కొండల పైన చాముండీ దేవీ భవ్య ఆలయం అమరి ఉంది. కొండ మధ్యలో విశ్రాంతి తీసుకుంటున్నట్లు చెక్క బడిన అతి విశాలకాయమున్న నంది విగ్రహం మనల్ని ఆకర్షిస్తుంది. ఇది ఒక విశాలమైన బండనుండి చెక్కబడిన శిల్పం.

కృష్ణరాజసాగర్ (కావేరీ నదిపై కట్టబడిన ఆనకట్ట) ఆనకట్ట వద్ద ఒక జగత్ప్రసిద్ధమైన "పూతోట - బృందావనం" - ఉన్న సంగతి మనకు తెలిసినదే. ఈ పూతోట మైసూరు నుండి 18 కి.మీ.ల దూరంలో ఉన్నది.

మైసూరు నుండి ఉదక మండలం పోయే మార్గంలో (మైసూరు నుండి 80 కి.మీ.ల దూరం) బొండిపుర వద్ద ఒక పెద్ద పక్షుల ఆశ్రమం వెలసి ఉంది. ఇక్కడ భయంకర అడవి ఏనుగులు గుంపులు గుంపులుగా తిరుగు తుంటాయి. అడవి యెద్దు, చుక్కల జింక, పులి, ఎలుగుబంటి, చిరుతల సమూహాన్ని కూడా ఇక్కడ చూడగలం.

మైసూరుకు తూర్పు దిశలో సుమారు 40 కి.మీ.ల దూరంలో ఉన్న సోమనాథపురం అని పిలువబడే చిన్న గ్రామంలోని 13వ శతాబ్దికి చెందిన కేశవ ఆలయం చాలా ప్రసిద్ధి గాంచిన దేవాలయం హొయసలుల కాలంలో వారిచే నిర్మింపబడిన ఆఖరి దేవాలయంగా ఈ కేశవఆలయాన్ని చరిత్ర పరిశోధకులు భావిస్తున్నారు. మైసూరుకు 93 కి.మీ.ల దూరంలోఉన్న 'శ్రావణ బెళగొళ'లో వెయ్యి సంవత్సరాల నాటి జైనుల శిల్పం చెక్కు చెదరని స్థితిలో ఈ రోజుకు ఉంది. ఇది జైనుల ప్రాభవంలో నున్న క్షేత్రం ఇందులో 17 మీటర్ల పొడవున్న గోమటేశ్వర శిల్పం కండ్లకు మిరుమిట్లు గొలుపుతుంది. శ్రావణ బెళగొళకు 56 కి.మీ.ల దూరంలో నున్న బేలూరులో మరో చెన్న కేశవ ఆలయం ఉంది. ఈ ఆలయ

**"మేలు చేసేవారికి మేలు చేయడం సహజమే కాని, కీడు చేసే వారికి మేలు చేయడం సర్వ శ్రేష్ఠం."**

నిర్మాణం 12 వ శతాబ్దంలో జరిగినట్లు భావించబడుతున్నది ఈ ఆలయం మధ్య యుగంలో మన పూర్వీకులు సాధించిన ఘనకార్యానికి నిదర్శనగా




నిలచిపోయింది. బేలూరు సమీపంలోని హలెబీడులో హొయసలేశ్వరుని పేరిట నిర్మించబడిన శివాలయాన్ని మనం చూడగలం. పశ్చిమ ప్రాంతానికి చెందిన జోగ్ జలపాతం మనకు గగుర్పాటును కలిగిస్తుంది. ఈ జలపాతం ప్రపంచంలోని ఎత్తైన జలపాతాలలో ఒకటి. ఈ స్థలంలో 'శరావతి' నది ఒక్కసారి శరవేగంతో 253 మీటర్ల క్రిందికి దూకుతుంది.

ఒకప్పుడు మహోజ్జ్వలంగా వెలసిన విజయనగర సామ్రాజ్యానికి రాజధాని నగరం, హంపి ఈ రోజు ఒక చిన్న గ్రామం. ఈ గ్రామం హొసపేట పట్టణానికి 11 కి.మీ.ల దూరంలో ఉంది. ఇక్కడ ప్రసిద్ధి గాంచిన విరూపాక్షాలయం, విఠలరాయ మందిరానికి చెందిన చారిత్రాత్మక రాతిరథం మరి ఇతర దేవాలయాలు; పాడుబడ్డ భవనాలు, శిథిలాలు ఎన్నో ఉన్నాయి. రాతి రథంలో చెక్కబడిన 56 రాతి స్తంభాలు మీటిన వెంటనే సప్తస్వరాలను వినిపిస్తాయి.

పడమటి కనుమల మార్గంలో ఉన్న కూర్గ్ చిక్కటి అరణ్యాలతో కూడుకున్న ప్రాంతం. ఈ ప్రాంతం కాఫీ తోటలూ, నారింజ తోటలు, వరి పండే సారవంతమైన భూములకు పెట్టింది పేరు.

పశ్చిమ కోస్తాకు చెందిన అందమైన నగరం మంగళూరు. ఈ నగరం కాఫీ, జీడి పప్పు, టైల్స్ (పెంకులు) మొదలైన సరకులకు కీలకమైన వ్యాపార కేంద్రం. మంగళూరు సమీపంలో వెలిసిన ఉడిపి పట్టణం కృష్ణ మందిరం గల యాత్రాస్థలం.

## ప్రపంచపు చమురు నిలువలు మరో 34 సంవత్సరాల వరకు ఉంటాయి

*ఇప్పుడు ప్రపంచంలో 96 బిలియన్ల టన్నుల చమురు ఉన్నట్లు అంచనా వేయబడింది. ఈ 96 బిలియన్ టన్నుల చమురును తక్కువ ఖర్చుతో పొందగలుగుతున్నాం. మిత వ్యయంతో కూడిన చమురును మరో 34 సంవత్సరాల వరకు మాత్రం, ఇప్పుడున్న వాడకం ప్రకారం (సంవత్సరానికి 2 8 బిలియన్ల టన్నులు) వాడుకోగలం.*

— 'యోజనా' సౌజన్యంతో

"ప్రశాంతమైన మనస్సు విలువైన మూలధనం."

కర్ణాటక రాష్ట్రానికి ఉత్తరాన ఉన్న బిజాపూర్‌లో జగత్ప్రసిద్ధిగాంచిన 'గోల్ గుంబజ్' (గోళాకార కట్టడం) కట్టడం నిలబడి ఉంది. ఈ కట్టడంలో మహమ్మద్ ఆదిల్ షా (1627 - 57) సమాధి ఉన్నది ఇదొక రహస్యాలు చర్చించుకునే గ్యాలరీ (వసారా).




ఈ గోళాకార కట్టడం వ్యాసం 40 మీటర్లు. ఇక్కడి గుసగుసల ధ్వని 12 రెట్లు ఎక్కువై ప్రతిధ్వనిస్తుంది. స్పెయిన్ దేశంలోని కోర్‌డోబా (Cordoba) కట్టడం నమూనా ప్రకారం కట్టబడిన కోటలోని మసీదు చాలా ప్రసిద్ధి గాంచిన కట్టడం. మొత్తం భారతదేశంలో ఇలాంటి కట్టడం ఇదొక్కటే.

బిజాపూర్‌కు కొన్ని కిలోమీటర్లు అటు ఇటుగా బాదామి, అయిహొలె, పట్టాడకల్ మొదలైన పట్టణాలున్నాయి. రాతిలో చెక్కబడిన మందిర నిర్మాణాలకు ప్రసిద్ధులైన చాళుక్యులు క్రీ.శ 600 - క్రీ.శ. 700 మధ్య కాలంలో ఆలయాన్ని నిర్మించారు. బాదామిలోని 18 చేతుల నటరాజ విగ్రహం అద్భుతమైన శిల్పకళకు అత్యుత్తమ నమూనా. తాండవ శివుడి 81 నృత్య భంగిమలు చూపరులను ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి.

దక్షిణ ప్రాంతానికి చెందిన కర్ణాటక రాష్ట్రానికి మరొక ప్రత్యేకత కూడా ఉంది. మనకున్న రెండు రకాల శాస్త్రీయ సంగీతాల్ని - కర్ణాటక సంగీతం, హిందూస్తానీ సంగీతం - ఒకేలా అభ్యసించే వ్యక్తులున్నారు. అసలు కర్ణాటక సంగీతానికి ఆపేరు ఈ రాష్ట్రం కారణంగానే వచ్చింది.

## ప్లాటినమ్ జూబిలీ

*ఒక సంస్థ 75 వ వార్షికోత్సవాన్ని ప్లాటినమ్ జూబిలి అంటారు. ఆ తరువాత సంస్థ చరిత్రలో రాబోయే మహత్తర సంఘటన జూబ్లీకాదు శతవార్షికోత్సవమే. ఆ తరువాత జరిపే 125 సంవత్సరాల పండుగను, 150 సంవత్సరాల పండుగను తెలుగులో వరుసగా శతవార్షికోత్సవానంతర రజతోత్సవం అని, శతవార్షికోత్సవానంతర స్వర్ణోత్సవం అని పిలుస్తారు.*

— స్వర్గీయ డా. ఆచార్య వి. పెరుమాళ్

## శ్రమ గొప్పతనం!

*చాలా సంవత్సరాల క్రిందట ఒకసారి నేను సుప్రసిద్ధ హెన్రీ ఫోర్డు అతిథిగా ఉన్నాను. భారత ప్రజకు తన సందేశాన్ని ఇస్తూ "భారత దేశం శ్రమ గొప్పతనాన్ని తెలుసుకోగలిగినప్పుడే మరోసారి తలెత్తగలదు" అన్నారు. భారతదేశం యువత కాయకష్టం చేయడానికి ఇష్టపడడం లేదని కూడా వారన్నారు.*

— భిక్షు చమన్‌లాల్

భరతనాట్యం బాగా ఈ రాష్ట్రంలో వేళ్ళూనింది. యక్షగానం అన్నది ఈ రాష్ట్రవు అతి ప్రధానమైన జానపద కళ. నాటకరంగం ఈ రోజుకు ఈ కళను ప్రోత్స హిస్తున్నది. కర్ణాటక ప్రాంతం తోలుబొమ్మ లాటలకూ, హరికథలకూ మరియు గమకాలకు కూడా చాలా ప్రసిద్ధి గాంచిన ప్రాంతం



కర్ణాటక ప్రాంతం సాహిత్యం వెయ్యి సంవత్సరాల చరిత్ర ఉన్న సాహిత్యం. కన్నడ సాహిత్యపు ప్రప్రథమ మహాకావ్యాన్ని నృపతుంగ అనబడే 9వ శతాబ్దానికి చెందిన రాజు రచించాడు ఈ గ్రంథం పేరు కవిరాజమార్గ. వచనాలన్న పేరుతో రచనలు చేసి బసవేశ్వరుడు కన్నడ భాషకు, సాహిత్యానికి కొత్తమలుపు నిచ్చాడు. విశ్వ ప్రజల్లో ప్రచారం చేశాడు. కన్నడ సాహిత్యం బసవేశ్వరుడి కారణంగా సమృద్ధిని పొందింది.

చందనం, ఏనుగు దంతాల చెక్కడాలకూ, అలంకరణ సామగ్రికి ఉపయోగపడే రోస్‌వుడ్ టేకు, లక్కబొమ్మలకు ఈ రాష్ట్రం మంచి పేరును సంపాదించుకుంది. నేతపని నేర్పరితనానికి, అందానికి మైసూరు క్రేప్ జార్జెట్టులు, పట్టు మొదలైనవి చక్కటి నిదర్శనాలు. లోహంతో తయారుచేయబడే 'బిద్రి' వస్తువులకు దేశంలో మంచి గిరాకీ ఉంది. మైసూరు అగర బత్తులు ప్రపంచం మొత్తాన్ని తమ సుగంధంతో ఈ రోజు నింపివేశాయి.

## ప్రపంచ ప్రసిద్ధిగాంచిన చిల్కా సరస్సుకు అపాయం

*ప్రపంచ ప్రసిద్ధి గాంచిన ఒరిస్సాలోని చిల్కా సరస్సులో నీరు 1914 లో 906 చ.కి.మీ ల దూరం వరకు వ్యాపించి ఉండేది ప్రస్తుతం విస్తీర్ణత 805 చ.కి.మీ కు తగ్గింది. ఆయకట్టు ప్రాంతం భూమికోతకు గురి అవుతుంది అంతేకాదు ఈ సరస్సు ముఖం కూడా బాగ కూరుకుపోయింది. 35 కి.మీ.ల పొడవు కాలువ ద్వారా ముఖాన్ని బంగాళాఖాతంతో కలిపారు.*

*— ఆధారం: అడవులు, వాతావరణం శాఖ ఒరిస్సా*

## చనిపోయిన షార్క్ చేప ఉప్పునీళ్ళలో కరుగుతుంది

*చనిపోయిన షార్క్ చేప శరీరం చాల మెల్లగా మునుగుతుంది. శరీరం అడుగ భాగం చేరేంతలోపల మొత్తం శరీరం ఉప్పునీళ్ళల కరిగిపోతుంది. మొత్తం శరీరంలో ఉప్ప వలన కరగని భాగం షార్క్ పండ్లు మాత్రమే*

## 24 గంటలలో మొత్తం ప్రతులు అమ్ముడుపోయాయి



'కన్యాదానం' అన్న పేరుతో ఒక పెద్ద మనిషి ఓ పుస్తకాన్ని రాసి ప్రచురించాడు. ప్రతులు అమ్ముడుపోలేదు. ఆ పెద్దమనిషి దినపత్రికలో ఒక ప్రకటనను ఇచ్చాడు. ఆ ప్రకటనలో ఇలా రాయబడి ఉంది: "యువకుడు, అందగాడైన ఒక లక్షాధిపతికి వధువు కావలెను. వధువు ఫలానా పెద్ద మనిషి రాసిన కన్యాదానం నవలలోని నాయకురాలు వలె ఉండాలి." అంతే! మొత్తం ప్రతులు 24 గంటలకాలంలో అమ్ముడుపోయాయి.

## కేకవేయండి, మేనేజరు వస్తారు

సేల్స్‌మాన్: "అయ్యా మేనేజరుగారు ఎక్కడుంటారో చెప్పగలరా?"

రిసెప్షనిస్టు: "ఈ హాలు గుండా వెళ్ళండి. మీకొక ద్వారం ఎదురవుతుంది. ఆ ద్వారం గుండా వెళ్ళి ఎడమవైపుకు తిరగండి. అక్కడున్న మెట్లనెక్కండి 'ఇది ప్రైవేట్ - దూరంగా ఉండండి' అన్న బోర్డు మీకు కనబడుతుంది. లోపలికి వెళ్ళండి, మీకు చాలా ఇరుకైన మార్గం కనబడుతుంది. కొంత చేరువలో 'నిశ్శబ్దం' అన్న ఫలకం మీకు కనబడుతుంది అక్కడ మీరు కేకవేయండి. అప్పుడు మేనేజరుగారు బయటకు వస్తారు."

## ఆర్థిక విషయాల ప్రతిభాశాలి

"ఆర్థిక విషయాల ప్రతిభాశాలి" అని ఒక వ్యక్తిని పొగడడం నేను విన్నాను. ఆ మాటకు అర్థం ఏమి నాన్నా"

"తన కుటుంబ సభ్యులు వెచ్చించలేనంత వేగంగా డబ్బును సంపాదించే వ్యక్తిని ఆ పేరుతో పిలుస్తారు."

## పశ్చిమ ఆసియాలోని నూనెగనులలోని నిలువలు

*పశ్చిమ ఆసియాలోని నూనె నిలువలు మరో 105 సంవత్సరాల వరకు ఉండగలవు. ఈ నిలువలు ప్రపంచంలోని నూనె నిలవలలో 75 శాతం అన్నమాట. ప్రపంచం మొత్తంలో తయారయే ఇంధనంలో ఇది 1/3 వ భాగం అవుతుంది.*



# శనిగ్రహం సూర్యమండలానికి చెందిన రెండవ అతివిశాల గ్రహం

సూర్య మండలానికి చెందిన గ్రహం శనిగ్రహం. వైశాల్యం దృష్ట్యా ఈ గ్రహానికి రెండవ స్థానం లభిస్తుంది. ఈ గ్రహం వ్యాసం 119,296 కిలోమీటర్లు. సూర్యుడికి శనిగ్రహానికి మధ్యనున్న సరాసరి దూరం 1417.6 మిలియన్ కిలో మీటర్లు. సూర్యుడి చుట్టూ ఉన్న జూపిటర్ (బృహస్పతి) మరియు యురేనస్ (వరుణ గ్రహం) కక్ష్య (orbit)ల మధ్య భాగంలో శనిగ్రహం కక్ష్య ఉంది.




శనిగ్రహంలోని సమూహం (Mass: పదార్థాల పరిమాణానికి వాడబడే కొలత) భూమిపైన నున్న సమూహం కంటే 95 రెట్లు ఉంటుంది కానీ ఈ పదార్థాల సరాసరి బరువు తక్కువగా ఉంటుంది కారణం ఈ సమూహం తేలికైన హైడ్రోజన్‌తో తయారు చేయబడి ఉండటమే. నిజం చెప్పాలంటే ఇది నీటికంటే కూడా చాలా తేలిక.

సూర్యుడి కక్ష్యలో ఒకసారి తిరగడానికి సాధారణంగా శనికి 29.5 సంవత్సరాలు పడుతుంది. తన కక్ష్యలో తిరగడానికి ఈ గ్రహానికి సుమారు 10 గంటల 14 నిమిషాలు పడుతుంది.

శని చుట్టూ మూడు వృత్తాలు ఉన్నాయి. ఈ వృత్తాలు (Rings) బహుశా మంచు ముక్కలతోగాని లేదా రాతి ముక్కలతో గాని ఏర్పడి ఉంటాయని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఈ వృత్తాలు వేలాది మెలి తిరిగిన (Spiral) పట్టెలను కలిగి ఉంటాయి.

(మిగతా 21 వ పేజీలో)

# అమెరికా అంతరిక్ష గాములకు చెడురోజు

*1970, ఏప్రిల్ 13వ తారీఖు అమెరికా అంతరిక్షగాములకు దురదృష్టంతో కూడుకున్న రోజు. ఆ రోజు వారు అపోలో 13 అంతరిక్ష యానంలో బయలుదేరారు. కాని మధ్యదారిలో ప్రాణవాయువు టాంకు ప్రేలింది. కాని వారు సురక్షితంగా తిరిగి భూమిని చేరుకోగలిగారు.*

"అంతమును తలచి ఆవేదన చెందేవానికి ఆరంభం నుండీ బ్రతుకు అలసటతో నిండి ఉంటుంది."

# మీ తీరిక సమయాన్ని ఆనందంగా గడపడానికి 11 మార్గాలు

1 మీ చేతులతో వస్తువులను తయారు చేయడంలో ఉన్న జలదరింపులోని ఆనందాన్ని అనుభవించండి.
2 మీ జీవితాన్ని సంగీతంతో పరిపూర్ణం చేసుకోండి.
3 నేర్చుకోవడంలో ఉన్న ఆనందాన్ని అనుభవించండి.



4. వినోద ప్రపంచం నుండి మీకు కావలసిన దాన్ని వివేకంతో ఎన్నుకోండి.
5 ఆటలలో ఉత్సాహంగా పాల్గొనండి
6. భూప్రదక్షిణం చేయండి.
7 పుస్తక ప్రపంచాన్ని అనుభవించండి.
8 ఇతరులకు సహాయం చేయడంలో ఉన్న ఆహ్లాదాన్ని అనుభవించండి.
9. మీరు ఆడే ఆటలనుండి మీరు పొందగలిగేంత ఆనందాన్ని పొందండి.
10 సేద తీర్చుకోవడం నేర్చుకోండి. ఇష్ట పడండి.
11. ఆశావాదులైన వ్యక్తులతో సంబంధాలు పెంచుకోండి.

— "టర్న్ ఆన్ ది గ్రీన్ లైట్స్ ఇన్ యువర్ లైఫ్"

## ప్రేమ - విశ్వాసం

*ప్రేమ - విశ్వాసం హృదయానికి సంబంధించిన విషయాలు. ఈ రెండు వస్తువులను మనం బజారులో గాని, తుపాకిని చూపించి బలవంతంగా గాని పొందలేము.*

— *జవహర్‌లాల్ నెహ్రూ*

( 20 వపేజీ తరువాయి)

శనిగ్రహం పైనున్న వాతావరణంలో హైడ్రోజను (జలవాయువు) భాగం ఎక్కువగ ఉంటుంది. అక్కడి ఉపరితలం ఉష్ణోగ్రత మైనస్ 151 డిగ్రీల సెంటీగ్రేడు. అందు వల్ల ఎలాంటి జీవరాశి ఉండేందుకు అవకాశం లేదు. శనిగ్రహంలో 20 లేద అంతకు మించిన ఉపగ్రహాలు ఉన్నాయి. ఈ ఉపగ్రహాలలో అతి పెద్దదైన ఉపగ్రహం పేరు టైటాన్. ఈ గ్రహం పరిమాణం బుధగ్రహమంత ఉంటుంది. టైటానులో నత్రజని (Nitrogen) వాతావరణం మరియు హైడ్రోకార్బన్స్ ఉన్నాయి. జీవరాశికి ఇవి రెండూ చాలా అవసరం. అయినా అక్కడ జీవరాశి ఉన్నట్లు ఇంతవరకు రుజువులు లేవు.

"మీ సంపద విలువకంటే మీ వ్యక్తిత్వపు విలువ అత్యధికం."

# నికోబారీస్ తెగ

నికోబారీస్ తెగ ఆదిమవాసులు బంగాళా ఖాతంలోని అండమాన్‌కు చెందిన నికోబార్ దీవులలో నివసిస్తున్నారు. ఈ జాతి ప్రజలు సుఖసంతోషాలతో తమ జీవితాన్ని గడుపుతున్నారు. చూడ్డానికి ఈ తెగ మనుషులు బర్మీయులు లాగా ఉంటారు



వీరు మంగోలాయిడ్ (Mongoloid) తెగ వారై ఉంటారు. వీరు బర్మా కోస్తా ప్రాంతమైన టెనాస్సేరిమ్ (Tenasserim) కు చెందిన తలైంగ్ (Talaing) నుండి వలస వచ్చిన వారి సంతతివారు. ఇక్కడి ఆడవారు లుంగీ, రవికలను ధరిస్తారు. పురుషులు రెంగ్ (Reng) లేక రెండు మీటర్లు పొడవున్న 'గోచి'ని ధరిస్తారు. ఈ గోచిని నడుముకు చుట్టుకుంటారు. అంచులు మాత్రం వదులుగా వ్రేలాడుతుంటాయి యువకులు గోచీతో పాటు చేతికి ఒక పట్టీ (band)ను కట్టుకుంటారు. పురుషులు కూడా తమ తల చుట్టూ ఒక పట్టీని కట్టుకుంటారు

ఈ నికోబారీస్ తెగవారి జీవన విధానం అతివేగంగా మారిపోతున్నది. అన్ని రంగాలలో అభివృద్ధి ప్రగతి చిహ్నాలు కనబడుతున్నాయి. వీరు పందుల్ని మేపుతారు. పంది మాంసం కూడా తింటారు. కొబ్బరికాయలు వీరి ప్రధాన ఆహారం మాత్రమే కాదు పానం కూడా అతిథులను వీరు తాజా కొబ్బరికాయల నిచ్చి సత్కరిస్తారు. వీరు నీటిని ఎప్పుడోగానీ త్రాగరు దప్పిక గొన్నప్పుడు కొబ్బరి కాయను కోసుకుని ఆ తియ్యటి నీళ్ళను ఆరగిస్తారు కానీ వానాకాలం నీటిని వీరు కుండలలో భద్ర పరచుకుంటారు

## బాగా జీవించటం ఎలా?

చింత తగ్గించు, పని పెంచు.
సవారి తగ్గించు, నడక పెంచు
కోపాన్ని తగ్గించు, నవ్వును పెంచు
మాటలు తగ్గించు, ఆలోచనలను పెంచు.
త్రాగుడు తగ్గించు, శ్వాసను పెంచు
తిండి తగ్గించు, నమలడాన్ని పెంచు.
ఉపదేశాన్ని తగ్గించు, ఆచరణను పెంచు.
ఖర్చు తగ్గించు, పొదుపు పెంచు

'ఆత్మనాశనానికి కారణ భూతాలు కామం, క్రోధం, లోభం.''

వీరు తమ ఆహారాన్ని కొబ్బరి కండతో పాటు పాన్డనుస్ (Pandanus - అనాస పండును పోలిన పెద్ద పండు) అరటి తాం్ర మొదలైన వాటితో వండుకుని తింటారు. ఉడికించిన తరువాత ముద్దలా తయారయిన పదార్థాన్ని అత్యంత రుచి కరమైన పదార్థంగా భావించి తింటారు.



ందులు, కోళ్ళు, చేపలను వీరు ూంసంగా భుజిస్తారు. తమలపాకులు ఇక్కడ విస్తృతంగా పండుతాయి. తమల ాకులను వీరు ఎక్కువగా నములు కుంటారు.

కొబ్బరి మట్టలతో వీరు ఇంటి పైకప్పును ేసుకుంటారు. కొబ్బరి మట్టలను వీరు ఎవిటీ లాగా తెడ్లగా కూడా వాడుతారు. ొబ్బరి పూల నుండి వీరు కల్లును తయారు చేస్తారు. ఎండుకొబ్బెర నుండి ీరు నూనెను తీస్తారు. కొబ్బరి చిప్పలను ీరు, కల్లు త్రాగేందుకు కప్పులా వాడు ంటారు.

నికోబారీస్ తెగవారికి ఆటలపట్ల మక్కువ ఎక్కువ. వీరు మల్ల యుద్ధాన్ని, కేనో (Cano చిన్న పడవ) ల పందాన్ని ఎక్కువగా ఇష్టపడతారు. ఇప్పుడిప్పుడు వీరు కాలుబంతి ఆట కూడ ఆడుతున్నారు. పండుగ వచ్చిందంటే ఆడుతూ, పాడుతూ గడుపుతారు ప్రతి పండుగకు వీరి ఇంట తప్పనిసరిగా విందు ఏర్పాటు ఉంటుంది. ఈ విందు రెండు రోజుల దాకా నిరాఘాటంగా జరుగుతుంది. వచ్చిన అతిథులు కూడా నిద్రపోకుండా ఈ విందులలో పాల్గొంటారు.

ప్రతి ఒక్క నికోబారీస్ గ్రామానికి గ్రామ పెద్దతో పాటు ఒక వైద్యుడు కూడా ఉంటాడు. వైద్యుణ్ణి ఇక్కడి ప్రజలు తమ భాషలో "మెన్లుఆనా" (Menluana) అని పిలుస్తారు. ఇతడు ప్రతి గ్రామాన్ని సందర్శించి ప్రజలకు వైద్యం చేస్తుంటాడు. ఇతనితో పాటు అతని విద్యార్థులు కూడా వెళుతుంటారు. వారిని మాఫై (Ma-a-fai) అంటారు. వారే తర్ఫీదు పొంది ముందు ముందు వైద్యులుగా మారుతారు.

నికోబారీస్‌లు తమ ఇండ్లను వెదురు స్థంభాలపై కట్టుకుంటారు. నిచ్చెనల ద్వారా వీరు తమ తమ ఇండ్లను చేరుకుంటారు. ప్రతి ఇంటి క్రింద కొంత ఎత్తైన ప్రదేశం

## ప్రత్యక్ష పన్నుల వసూళ్ళు

*గడచిన ఆర్థిక సంవత్సరంలో (1993 - 1994) ప్రత్యక్ష పన్నుల ద్వారా1 9,053 కోట్ల రూపాయలు వసూలయ్యాయి. కంప్యూటర్లను నెలకొల్పిన తరువాత ఈ వసూళ్ళు 50,000 కోట్లకు చేర గలదని అంచనా వేస్తున్నారు.*

(ప్లాట్‌ఫారమ్) ఉంటుంది. ఇక్కడ వీరు తమ బంధు మిత్రులతో కలిసి కూర్చొని మాట్లాడుకుంటూ తమ పనులు చేసుకుంటారు. వంటకు దగ్గరలోనే మరొక గుడిసె ఉంటుంది. వీరు అప్పుడప్పుడు వంటను బహిరంగ ప్రదేశంలో కూడా వండుతుంటారు.

ఆత్మవిశ్వాసం, సజాతీయ భావం, సహకారం ఈ తెగ విశిష్ట గుణాలు. అందరూ కలసి తమ తమ గ్రామాలను శుభ్రంగా



ఉంచుకుంటారు. చెత్తను ప్రోగుచేసి గ్రామ ప్రజలు సముద్రంలో పారేస్తారు.

ప్రస్తుతం సుమారు 29,000 ల నికోబారీస్‌లు ఈ ద్వీపాలలో ఉన్నారు. వీరిలో చాలామంది క్రైస్తవులు వీరిలో కొందరు ఇప్పటికీ అనిమిసమ్ (ప్రతి జీవములోనూ ఆత్మ ఉన్నదన్న నమ్మకం) ను నమ్మే వారున్నారు.

# ఎచట మేధ భయరహితమో!




ఎచట మేధ భయరహితమో,
ఎచట శీర్ష ముత్తుంగమో,
ఎచట జ్ఞానము స్వేచ్ఛాపూరితమో,
ఎచట సంకుచిత స్వదేశీగోడల మధ్య
ప్రపంచం వగిలి తునాతునకలు కాదో,
సత్యమనే లోతులనుండి మాటలు ఎక్కడ
వెలువడుతుంటాయో
పరిపూర్ణత కోసం అలుపు లేకుండా
ప్రయాసపడే హస్తాలు ఎక్కడ వ్యాపిస్తాయో,
మృతి చెందిన అలవాట్లనే నిరాశమయ
ఎడారి
ఇసుకలోకి హేతువనే స్వచ్ఛ ప్రవాహం ఎక్కడ
ఇంకి పోకుండాఉంటుందో
నీ మేధ ఎక్కడ నిరంతర విస్తృత ఆలోచనా,
పోరాటాల వైపు పురోగమిస్తుందో....
ఆ స్వేచ్ఛా స్వర్గంలో.......ఓ పితా!
నాదేశం మేల్కొనుగాక!

— రవీంద్రనాథ్ టాగూర్

"మనస్సు, శరీరం రెండూ ఆరోగ్యంగా ఉన్నప్పుడే సంపూర్ణ ఆనందం లభిస్తుంది."

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 అన్నం, పప్పు మరియు పెరుగు మాత్రం తింటున్న వ్యక్తి ఏ పదార్థ లోపాన్ని కలిగి ఉంటాడు?
(ఎ) గంజి, (బి) కొవ్వు (సి) విటమిన్లు, (డి) మాంసకృత్తులు.



2. క్రింది కనపరచిన పదార్థాలలో అతి కఠినమైన దేది?
(ఎ) వజ్రం, (బి) ఇత్తడి, (సి) స్టీలు, (డి) అల్యూమినియం.

3. క్రింద కనపరచిన ఏయే రాష్ట్రాలలో ఋతుపవనాల కారణంగా చలికాలంలో వర్షాలు వస్తాయి?
(ఎ) బీహారు, (బి) కేరళ, (సి) అస్సాం, (డి) తమిళనాడు.

4. నవంబరు 14 వ తారీఖున మనం ఏ పేరుతో జరుపుకుంటున్నాము:
(ఎ) పౌరుల దినోత్సవం, (బి) బాలల దినోత్సవం, (సి) మానవ హక్కులదినం, (డి) ఐక్యరాజ్యసమితి దినం.

5 సర్ రిచర్డ్ అట్టన్‌బరో నిర్మించిన 'గాంధీ' చిత్రంలో గాంధీగా నటించిన నటుడు పేరేమి?
(ఎ) ఫ్రాంక్ సినాత్రా, (బి) రెక్స్ హారిసన్, (సి) బెన్ కింగ్స్‌లే, (డి) పింక్ ఫ్లాయిడ్.

6 న్యాయ వ్యవస్థ కర్తవ్యం ఏమిటి?
(ఎ) చట్టాలను వ్యాఖ్యానించడం, (బి) చట్టాలను ఆమోదించడం, (సి) చట్టాలను అమలుపరచడం, (డి) శాంతి భద్రతలను పర్యవేక్షించడం.

7. జాతీయ సమైక్యతకు అతి ఆవశ్యకమైన ప్రధాన లక్షణం:
(ఎ) సాంస్కృతిక ఏకరూపత, (బి) ఆర్థిక గుర్తింపు, (సి) జాతీయ విశ్వాస భావం, (డి) భాషా ఐక్యత.

8. చంద్రుడి తరువాత చాలా ప్రకాశవంతంగా కనబడే అలౌకిక వస్తువు:
(ఎ) శుక్రగ్రహం, (బి) బృహస్పతి గ్రహం, (సి) ధృవ నక్షత్రం, (డి) అగ్నినక్షత్రం.

## మాటల మహిమ

1. ఎరియు: (ఎ) మందు, (బి) ప్రాంతం, (సి) తెలుసుకొను, (డి) ఎరువు.

"సత్యం కనుగొనటం కంటే తప్పును తెలుసుకొనటం సులభం; ఎందుకంటే తప్పు ఉపరితలంపైన ఉంటుంది, తేలికగా కనిపిస్తుంది. కానీ సత్యం లోతుగా ఉంటుంది, చాలా కొద్దిమంది మాత్రమే దీనికోసంవెదికేందుకు ఇష్టపడతారు."

2 పాము: (ఎ) గజ్జి, (బి) గడ్డి, (సి) గరిట, (డి) గంట.
3 భూకము. (ఎ) భోగము, (బి) భూమి, (సి) బొక్క, (డి) భల్లూకము.
4. వందు: (ఎ) వచ్చి, (బి) నమస్కారం, (సి) వసందు, (డి) విచారపడు.
5. సొంటు: (ఎ) సెంటుకు వికృతి, (బి) కుంటి, (సి) తప్పు, (డి) ఎండిన అల్లము
6. ఇడి: (ఎ) మెఱపు, (బి) అడుగు, (సి) కట్టెలు, (డి) సేమ్యా.
7. ఆడేలు: (ఎ) చాకలి, (బి) కొంగ, (సి) ఆడ తోడేలు, (డి) తినుబండారం.
8. ఉడ్డ: (ఎ) నాలుగు, (బి) గుడ్డ, (సి) గడ్డ, (డి) దవడ.

## తెలివికి పరీక్ష

1. పరిమాణం దృష్ట్యా ఏది ఎక్కువ· ఒక కిలో ఈకలా లేక ఒక కిలో పండ్లా?
2 క్రింద కనబరచిన నగరాలలో ఏ నగరం అమెరికాకు చెందనిది: (ఎ) చికాగో, (బి) శాన్ ఫ్రాన్సిస్కో, (సి) బోస్టన్, (డి)మియామీ, (డి) హెూబార్ట్, (ఇ) సీట్టల్.
3. గాంధీ పేరుండి నెహ్రూ వంశానికి చెందిన్న వ్యక్తి పేరు?
4 5/5 = 1 అయినప్పుడు 0/0 = 1 ఎందుకు కాదు?
5 వార్తలలో ఉన్న ఇరాక్ ఇంతకు ముందు ఏ పేరుతో పిలువబడేది?

(జవాబులకు వ పేజీ చూడండి)

## ప్రపంచంలోని అత్యుత్తమ ఆకర్షణలు!



గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా, చైనా
గ్రాండ్ కెన్‌యాన్, యుఎస్ఏ
రాక్ సిటీ ఆఫ్ పెట్రా, జోర్డాన్ (పశ్చిమ ఆసియా)
పిరమిడ్స్ మరియు స్ఫిన్క్స్, ఈజిప్ట్ (ఆఫ్రికా)
సెరిన్‌గెటి నేషనల్ పార్క్, టాంజేనియా
సహారా ఎడారి, ఉత్తర ఆఫ్రికా
బారిలోచె, అర్జెంటీనా (దక్షిణ అమెరికా)
ఇగువాకు ఫాల్స్, అర్జెంటీనా మరియు బ్రెజిల్ (దక్షిణ అమెరికా)
మచుపిచ్చు, పెరు (దక్షిణ అమెరికా)
తాజ్‌మహల్ (భారతదేశం)
నయాగర జలపాతం, అమెరికా మరియు కెనడా
క్రెమ్లిన్ మరియు రెడ్‌స్క్వేర్ (రష్యా)
మౌంట్ ఎవరెస్ట్ (నేపాల్)
రోమన్ కొలోసియమ్, (ఇటలీ)
అక్రోపోలిస్, (గ్రీస్)

"మరోవ్యక్తి వెనుక కూర్చుని సవారీ చేసేవాడు తన ఇష్ట ప్రకారం ప్రయాణం చేయలేడు."

# నిజాలు - నిదర్శనాలు

## 5,900 మిలియన్ టన్నుల లిగ్నైట్ నిలువలు

భారతదేశంలో సుమారు 5,900 మిలియన్ టన్నుల లిగ్నైట్ నిలువలున్నట్లు అంచనా వేయబడింది. ఈ నిలువలలో 4,400 మిలియన్ టన్నుల లిగ్నైట్ తమిళ నాడు దక్షిణ ఆర్కాటు జిల్లాకు చెందిన నైవేలిలో ఉన్నది.

## సేద్యానికి ఉపరితలం నీరు



మన దేశంలో 4000 బిలియన్ ఘన మీటర్ల నీరు (మంచు, వానల వల్ల లభ్యమయ్యేది) భూమిలో ఇంకుతున్నది. ఇందులో నుండి సుమారు 460 బిలియన్ల ఘన మీటర్ల నీటిని మనం ప్రస్తుతం వ్యవసాయం కోసం వాడుకుంటున్నాము.

## చైనాలో సగటున నూటికి 16 మంది టెలివిజన్‌లు కలిగి ఉన్నారు

ప్రతిరోజు 700 మిలియన్ల చైనీయులు టెలివిజన్ కార్యక్రమాలను చూస్తున్నారు. ప్రతి వందమందికి సరాసరి 16 మంది దగ్గర టెలివిజన్‌లు ఉన్నాయి. చైనీయుల టెలివిజన్ అల్లిక 140 మిలియన్ టెలివిజన్ల సెట్లకు పెరిగింది.

## 4,500 కోట్ల రూపాయలు సాలీనా నష్టం

ఆహార ధాన్యాలు, రసాయనాలు, ఎరువులు నిలువ చేసే కట్టడాలు క్షీణించడం వలన సాలీనా మనం 4,500 కోట్ల రూపాయలను నష్టపోతున్నాము. కట్టడాలు క్షీణించకుండా ఉండే చర్యలు తీసుకోగలిగితే 1,200 కోట్ల రూపాయల నుండి 1,500 కోట్ల రూపాయల వరకు మనం ఆదా చేయగలం.

## అభివృద్ధి చెందుతున్న దేశాల మొత్తం ఋణం

అభివృద్ధి చెందుతున్న దేశాలు ఇతర దేశాలకు 1,000 బిలియన్ల డాలర్ల మేరకు ఋణపడి ఉన్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాల ఎగుమతి రాబడి నుండి సుమారు 25 శాతం రాబడి అప్పు తీర్చడానికే ఖర్చు అవుతున్నది.

"మీ జ్ఞానం అంతా పుస్తకాల నుంచి వచ్చినదైతే, మీరు చాలా తరచుగా ఒప్పుకంటే తప్పే చేస్తారు." — లెబనీస్ సామెత

# దీపావళి ప్రాచీన కథలు

ఎన్. రామకృష్ణ

దీపావళి ఆబాలగోపాలానికి అతి ముఖ్యమైన పండుగ. దక్షిణ భారత దేశంలో ఈ పండుగ నరకాసురుడితో సంబంధపడి ఉంది. క్రూరుడైన నరకాసురుడు ప్రజలను అతిగా బాధపెట్టాడు. బాధ భరించలేని ప్రజలు శ్రీకృష్ణుడితో నరకాసురుడి బారినుండి తప్పించమని మొఱ పెట్టుకున్నారు. తన భార్య సత్యభామ సహాయంతో నరకాసురుడిని హతమార్చి ప్రజలను కృష్ణుడు ఆదుకొన్నాడు. దాంతో వారు నిర్భయులయ్యారు.



చనిపోయేముందు నరకాసురుడు కృష్ణుణ్ణి ఒక వరమిమ్మని ప్రార్థించాడు. కృష్ణుడు అభయమివ్వగా "స్వామీ ప్రజలు నేను మరణించిన రోజును ప్రతి సంవత్సరం దీపావళిగా జరుపుకునేలా నాకు వరమివ్వు" అని అన్నాడు. నరకాసురుడు కోరిన వరాన్ని కృష్ణుడు ఇచ్చాడు. అందుకే మనం దీపావళి పండుగను జరుపు కుంటున్నాము.

ఈ కథ కాకుండా మరోకథ కూడా ప్రచారంలో ఉంది. ఆ కథ ప్రకారం దీపావళి పండుగ మహాబలితో సంబంధం ఉన్నట్లు భావించబడుతోంది. మహాబలి భక్తి శ్రద్ధలకు మెచ్చి శివుడు అనేక వరాలు ప్రసాదించాడు. దాంతో బలి మహాబలవంతుడయ్యాడు. తన శక్తి కారణంగా మహాబలి ఇష్టం వచ్చినట్లు వ్యవహరిస్తూ ప్రజలను అనేక యాతనలకు గురి చేశాడు. మహాబలి చెడు ప్రవర్తనను ప్రజలు సహించలేక పోయారు. విసిగి వేసారిన ప్రజలు విష్ణుమూర్తితో తమ కష్టాలను విన్నవించుకున్నారు. వారి ప్రార్థనను విన్న విష్ణుమూర్తి వామనావతారం ఎత్తి మహాబలి వద్ద కొచ్చాడు. మహాబలిని మూడడుగులు భూమిని దానంగా ఇవ్వమన్నాడు. వామనుడి పాదాల కొలతను చూసి ఎగతాళిగా నవ్వుతూ మూడడుగులను ఇస్తానని ఒప్పుకున్నాడు.

## ప్రపంచంలోని అతి ప్రాచీన జంతు ప్రదర్శన శాల

బ్రిటన్ రాజధాని నగరం లండన్‌లో ప్రపంచంలోని అతి ప్రాచీనమైన జంతు ప్రదర్శన శాల ఉన్నది.

"నేను తప్పుచేసి శిక్ష పొందక పోవటం కంటే న్యాయమైన పనిచేసి కృతజ్ఞతలు పొందక పోవటాన్నే ఎన్నుకుంటాను."

— మార్కస్ కాటో

మాట తీసుకున్న వామనుడు తన విశ్వ రూపాన్ని ప్రదర్శించాడు. ఒక అడుగుతో మొత్తం భూప్రపంచాన్ని ఆక్రమించాడు. రెండవ అడుగుతో సమస్త ఆకాశాన్ని ఆక్ర మించాడు. మిగిలిన మూడో అడుగు ఎక్కడ పెట్టమంటావని మహాబలిని వామనుడు అడిగాడు. మాట తప్పని మహాబలి తన శిరస్సును వినయంగా వంచాడు. వంచిన తలపై మూడో పాదం మోపి మహాబలిని వామనుడు పాతాళానికి తొక్కేసాడు.



పాతాళలోకానికి పంపేముందు వామనుడు మహాబలికి ఒక వరమిచ్చాడు. ఆ వరం ప్రకారం పాతాళలోకానికి మహాబలి రాజయ్యాడు. సంవత్సరంలో ఒక రోజున - దీపావళి రోజున నీవు భూలోకం రావచ్చు. కానీ నీ ప్రవేశం వెలుతురు లేని చీకటి ప్రాంతానికి పరిమితమని వామనుడు వివరించాడు. అందుకే రాక్షస రాజు భూమండలానికి తిరిగివచ్చి మరల పరిపాలించకుండా ఉండేందుకు అంతటా వెలుతురుతో ప్రకాశవంతం చేయబడు తున్నది.

కొందరు ఈ పండుగను అయిదు రోజుల పండుగగా జరుపుకుంటారు. వారు మొట్టమొదటి రోజున లక్ష్మీదేవిని పూజిస్తారు. రెండవరోజును నరకుడిపై కృష్ణుడు విజయం సాధించిన రోజుగా కొనియాడతారు. ఆ కారణంగానే ఆ రోజును నరక చతుర్దశి అంటారు.

మూడవరోజును దీపాలంకరణ రోజుగా భావించి ఇండ్లను వెలుగుతో నింపు కుంటారు. నాలుగవరోజు వారికి స్నానాల రోజు. ఆ రోజు వారు యమధర్మరాజును

## 1982 లోని వార్తలు

### పది అంతస్తులంత ఎత్తుగల బెలూనులో ఆగకుండా ప్రయాణం

*ఇద్దరు పైలెట్లు పది అంతస్తులంత ఎత్తు గల సూపర్ చికెన్ III బెలూన్‌లో కాలిఫోర్నియాలోని కోస్టా మెసా (Costa mesa) లో ప్రారంభమై ఉత్తర అమెరికా ఖండాన్ని దాటి తూర్పు దిశలో జార్జియా ద్వీపానికి ఆవలివైపు నున్న తీరానికి ప్రయాణం చేయగలిగారు. అమెరికాలోని ఒక తీరప్రాంతం నుండి మరో తీర ప్రాంతానికి ప్రయాణం చేయడానికి బెలూన్ను మొదటిసారి సాధనంగా వాడారు పైలెట్లు జాన్ షూక్రాఫ్ట్ (John Shoecraft), ఫ్రెడ్ గోరెల్ (Fred Gorrell)లు ఒక తీరం నుండి మరో తీరానికి చేరడానికి 55 గంటల 25 నిమిషాలు తీసుకున్నారు. వీరు తమ ప్రయాణాన్ని ఎక్కడా ఆగకుండా కొనసాగించారు.*

"ప్రేమ, నైపుణ్యం కలిసి పనిచేసినప్పుడు ఒక ఉత్తమ కృతిని ఆశించవచ్చు."
— జాన్ రస్కిన్

పూజిస్తారు. దక్షిణదేశంలోని వారికి ఇది కొంత వింత ఆచారంగా కనిపిస్తుంది.

యమునా నదిని మనం యముడి సోదరిగా భావిస్తున్నాము. ఆ కారణంగా దీపావళి రోజున ప్రతి సోదరుడు తన సోదరితోగాని, స్వంత చెల్లెలు లేని పక్షంలో చెల్లెలు వరస అయిన వారితో గాని కలిసి భుజిస్తాడు. ఆ తరుణంలో ప్రతి సోదరుడు తన సోదరికి ఏదో ఒక నగను కానుకగా సమర్పిస్తాడు. పెద్దలు యముడిని ప్రార్థించి సాధ్యమైతే యమునా నదిలో స్నానం కూడా చేస్తారు.



మహారాష్ట్రలో ఇంటింట దీపాలను వెలిగిస్తారు. విష్ణుమూర్తి ఆలయాలు కూడా దీపాల కాంతితో ధగధగా మెరుస్తూ ఉంటాయి. ప్రతివొక్కరు తమ స్థాయి స్తోమతకు తగినట్లుగా తమ ఇంటిని దీపాలతో అలంకరించుకుంటారు. ధనవంతుల ఇంట గొప్పగా దీపకాంతులు విరజిమ్మగా పేదల ఇంట కనీసం ఒక దీపమైనా అంధకారాన్ని పారద్రోలుతూ ఉంటుంది. మతాబులు, చిచ్చుబుడ్లను దేశం అంతటా పిల్లలు ఒకేరకంగా ఆనందిస్తారు. ఈ ఆనందంలో ఎలాంటి హెచ్చుతగ్గులుండవు.

బెంగాల్‌లో ప్రజలు లక్ష్మీదేవిని కాక కాళీమాతను ఆరాధిస్తారు. కన్నెపిల్లలు దీపాలను వెలిగించి నదిలో తేలేలా వదుల్తారు. దీపాలు ఒకటి ఒకటిగా ఒక చోటుకు చేరడం అంత శుభసూచకం కాదన్న మాట. నదిలో ప్రవహింపజేసిన దీపాలు ప్రవాహంతో కలిసిపోవాలి, వొడ్డుకురాకూడదు. దీపాలు ముందుకు సాగితే ఆ సంవత్సరం

## నా పెన్సిల్ - నాకు కావాలి

బొంబాయిలో కాంగ్రెస్ మహాసభ జరుగుతోంది. బాపూ, తన ఆశ్రమవాసులతో ఒక విద్యా మందిరంలో బస వున్నారు. బయటికి వెళ్ళబోతున్న గాంధీజీ దేనికోసమో ఆత్రంగా వెతుకుతూండటం చూసి, ఒకాయన అడిగారు.

"ఏమిటి బాపూజీ, వెతుకుతున్నారు?"

"నా పెన్సిల్ - చిన్న పెన్సిల్."

తన జేబులోని పెన్సిల్ తీసి గాంధీజీకి యిచ్చారాయన.

"ఇది నాకక్కర్లేదు - నా పెన్సిల్ నాకు కావాలి."

"టైమవుతోంది, బాపూజీ - వచ్చాక వెతుకుదాం."

"మీకెవరికీ ఆ పెన్సిల్ విలువ తెలియదు. మద్రాసులో జి.ఏ. నటేశన్ చిన్న కొడుకు నాకెంతో ప్రేమగా ఇచ్చాడా పెన్సిల్!"

అందరూ కలిసి ఆ పెన్సిల్ ఎక్కడ దాక్కున్నది వెతికి ఇచ్చాక బాపూజీ ముఖంలో వెన్నెల విరిసింది.

"మూర్ఖులు మరణిస్తారు. కానీ ఇతర మూర్ఖులు ఎడతెగకుండా మందలుగా వస్తున్నంతకాలం మూఢత్వం నిల్చి ఉంటుంది."

— బ్రిజ్‌పాల్ భండారి

శాంతి సుభిక్షాలతో కళకళలాడుతుందని జనం భావిస్తారు.

ఈ పండుగ రోజుల్లో ఆవులను, ఎద్దులను శుభ్రంగా కడిగి పూలమాలతో అలంకరించి మంచి మేతను ఇస్తారు. ఆ తరువాత వీటిని పూజిస్తారు. కాని దక్షిణాదిలో ఈ పశుపూజను సంక్రాంతి రోజున జరుపుకుంటారు. మేతకు వెళ్ళిన పశువులు సాయంకాలం వెనుతిరిగి వస్తాయి. అప్పుడు ఈ పశువులకు ఆరతి కూడా పడతారు. ఆ విధంగా చేయడం వల్ల చెడును కలిగించే శక్తులు పారిపోతాయని కూడా భావించడం ఇక్కడ జరుగుతుంది.

వైశ్యులు ఈ పండుగను భారీయెత్తులో జరుపుకుంటారు. వారి నమ్మకాల ప్రకారం



దీపావళి రోజు విక్రమార్కుడు నూతన శకాన్ని ఆరంభించిన రోజు. అందుకే అది వారికి సంవత్సరాది. మరి కొంతమంది ప్రకారం దీపావళి రోజున రాముడికి అయోధ్యలో పట్టాభిషేకం జరిగిందట. వారి ప్రకారం ఆ రోజునే రాముడు అయోధ్యారాముడయ్యాడు.

ఈ ఆసక్తికరమైన కథల మేరకు దీపావళిని



అజ్ఞానాంధకారాన్ని తొలగించే దీపాల పండుగగా జరుపుకుంటున్నాము. కాబట్టి అందరూ వెలుగుతో తమ తమ జీవితాలను నింపుకొని మంచి గుణాల - సహనశక్తి, నిస్వార్థతను పెంచుకోవాలి. తమ అజ్ఞానాన్ని, అసహనాన్ని, స్వార్థాన్ని తొలగించుకోవాలి. అప్పుడే దీపావళి నిజమైన దీపావళి కాగలుగుతుంది.

---

## కొత్తరకం సంకర బియ్యం

*మునుపటి కంటే 25 శాతం ఎక్కువ దిగుబడి నిచ్చే కొత్తరకం సంకర (hybrid) బియ్యాన్ని చైనావారు కనుగొన్నారు. చైనాలో మొత్తం 33 మిలియన్ హెక్టార్లు సాగుబడిలో ఉన్నాయి. ఇందులోని 1/3 వంతుకు పైగా భూముల్లో ప్రస్తుతం కొత్తరకం వరిపైరును సాగుచేస్తున్నారు.*

"జీవితం ఒక నాటకం వంటిది. దాని పొడవు కంటే నటనలోని శ్రేష్ఠత ముఖ్యం."
— సెనెకా



## కృష్ణ వేణుగోపాల్

కుట్టు మిషను ఆవిష్కరణకు ముందు జనం తమకు కావల్సిన గుడ్డలను చేతులతో కుట్టుకునేవారు. సాధారణంగా కుట్టుపనిని స్త్రీలు చేసేవారు. అందుకే వారు సీమ్‌స్ట్రెస్ (Seamstress) అంటే కుట్టు పని చేయు స్త్రీలు అని పిలువబడేవారు.



1846వ సంవత్సరంలో అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన మేసాచుసెట్స్ (Massachusetts) నివాసి ఎలియాస్ హోవే (Elias Howe) కుట్టు మిషన్‌ను కనుగొన్నాడు. దాంతో వస్త్ర పరిశ్రమలో విప్లవాత్మక మార్పులొచ్చాయి.

బహుశ థామస్ సెయింట్ అనబడే ఆంగ్లేయుడు కుట్టు మిషన్‌ను క్రీ.శ. 1790లో మొట్టమొదటిసారిగా కనుగొని ఉంటాడని భావిస్తున్నారు. చర్మంతో తయారు చేయబడే వస్తువులను కుట్టేందుకు మొదటి కుట్టు మిషన్ వాడబడింది.

ఫ్రాన్స్ దేశానికి చెందిన బీద దర్జీ బార్తెలెమీ థిమ్మోనియర్ (Barthelemy Thimmonier) 1830లో ఒక కుట్టు మిషన్‌ను కనుగొన్నాడు. ఈ మిషన్ సహాయంతో అతను సైనికుల యూనిఫార్మ్‌ను అవలీలగా కుట్టగలిగాడు. ఈ మిషన్ కారణంగా తమ భుక్తికి ముప్పు రాగలదన్న భయంతో కోపోద్రిక్తులయిన కార్మికులు కార్ఖానాను కుట్టుమిషన్‌లను ధ్వంసం చేసారు. ఆ రోజుల్లోనే న్యూయార్క్ (USA) నగరానికి చెందిన వాల్టర్ హంట్ (Wlater Hunt) కొన్ని మార్పులతో ఒక కుట్టు మిషన్‌ను కనుగొన్నాడు. కాని హంట్ ఆవిష్కర్తలకు ఇవ్వబడే అధికార పత్రాన్ని (పేటెంట్‌ను) పొందలేకపోయాడు. ఉపయోగించుకోదగిన కుట్టుమిషన్ కనుగొన్న ఘనత అమెరికాకు చెందిన మెకానిక్ ఎలియాస్ హోవే (Elias Howe)కు దక్కుతుంది. వెంటనే దీనికి అధికార పత్రం దొరికింది. కొన్ని మార్పులను చేసి భారీ యెత్తున తయారు చేయడం మొదలు పెట్టారు.

## లేచి నించోవడమే!

లేచి నిటారుగా నుంచోవడమే బరువు మోయడం అయినప్పుడు నీవు మధ్య వయస్కుడివి అయినట్లే.

"చెడ్డ మనుషులు లేకపోయినట్లయితే, మంచి న్యాయవాదులు కూడా ఉండరు."
— ఛార్లెస్ డికెన్స్

అమెరికా సంయుక్త రాష్ట్రాలకు చెందిన మేసాచుసెట్స్‌కు సమీపంలో ఉన్న స్పెన్సర్‌లో ఎలియస్ హెూవే 1819వ సంవత్సరం జూలై నెల 9వ తారీఖున జన్మించాడు. వ్యవసాయదారుడైన




తండ్రితో జరిగిన పోట్లాట కారణంగా హెూవే చదువు మానేసాడు. ఆ తరువాత ఉద్యోగం చేయడం ప్రారంభించాడు. నేత పనివాడిగా, మెకానిక్‌గా, హెూవే అనేక రకాల మిల్లులలో పని చేసాడు. రాబడి తక్కువగా ఉన్నందువల్ల, తరచుగా ఇంటిల్లిపాది జబ్బుపడుతుండడంవల్ల, అదనపు ఆదాయం కోసం హెూవే భార్య రాత్రిళ్ళు పొద్దు పోయేవరకు కుట్టు పని చేస్తూ ఉండేది. హెూవే తన భార్యకు సహాయపడేందుకు ఏమైనా చేయాలనుకున్నాడు. చేస్తున్న పనిని వదిలేసి తండ్రి వ్యవసాయ క్షేత్రంలో కార్ఖానాను నెలకొల్పాడు. దురదృష్టవశాత్తు ఆయన కార్ఖాన కాలిపోయింది. అక్కడున్న పనిముట్లు, పరికరాలు నాశనమైపోయాయి.

హెూవే చేపట్టిన సాహస కార్యం పట్ల అతని పాతకాలం మిత్రుడు జార్జి ఫిషర్ (George Fisher) ఆసక్తి కనపరచాడు. మేసాచుసెట్స్‌కు చేరిన కేంబ్రిడ్జ్ పోర్టులో ఫిషర్ బొగ్గులు మరియు పాత కలప వ్యాపారం చేసేవాడు. కుట్టు మిషన్‌ను కనుగొనేంత వరకు ఫిషర్ తన మిత్రుడు హెూవేకు ఉచిత భోజన వసతి సదుపాయాలు కల్పించాడు. కుట్టు మిషన్‌ల తయారీవల్ల ప్రతిఫలంగా రాబోయే లాభాలలో 50 శాతం వాటాను కోరాడు.

1845వ సంవత్సరం ఏప్రిల్ నెలలో హెూవే కుట్టు మిషన్‌కు సంబంధించిన ఒక చిన్న యంత్రాన్ని తయారు చేసాడు. చెక్కతో తయారు చేయబడిన యంత్రంలో కొన్ని వైరులు, కొంత లోహం వాడబడింది. ఇది చూడడానికి ఇప్పటి టైప్‌రైటర్ మిషన్‌లా ఉండేది. ఈ మిషన్ ఒక చక్రం ఒక వంపు గల ఇరుసు సహాయంతో పని చేసేది. దాని తరువాత ఆ యంత్రాన్ని వాడడానికి మరికొన్ని నెలలు పట్టాయి. ఆ మిషన్‌తో హెూవే మొట్టమొదట రెండు జతల సూట్లను కుట్టాడు. అందులో ఒకటి తన కోసం, మరొకటి తన మిత్రుడు ఫిషర్ కోసం. ఈ మిషన్‌ను తయారు చేయడానికి హెూవేకు 300 డాలర్లు ఖర్చు అయ్యాయి. అమెరికాలోని న్యూయార్క్ నగరంలో ఈ యంత్రాన్ని ఇప్పటికి భద్రపరచి ఉంచారు.

ఫిషర్‌కు ఒక ఆలోచన వచ్చింది. ఆ మెషిన్ ప్రదర్శనను మరియు ఒక పోటీను ఏర్పాటు చేద్దామనుకున్నాడు. బోస్టన్

"ఒక మంచి శస్త్రవైద్యునకు గ్రద్ధచూపు, సింహపు హృదయం, నారీ హస్తం తప్పక ఉండాలి."

(యుఎస్ఏ)లో ఉన్న అతి పెద్ద ఫ్యాక్టరీ - క్విన్సీ హాల్ క్లోతింగ్ ఫ్యాక్టరీలో ఫిషర్ ఒక పోటీని ఏర్పాటు చేసాడు. పోటీలో అతి వేగంగా కుట్టు పని చేయగల అయిదుగురు స్త్రీలతో హోవే పోటీ పడ్డాడు. అయిదుగురు స్త్రీలకు తల అయిదు గుడ్డలు కుట్టేందుకు ఇవ్వ బడ్డాయి.




హోవే ఆ అయిదుగురు స్త్రీల కన్నా వేగంగా గుడ్డలను కుట్టి పోటీలో నెగ్గాడు. హోవే గుడ్డలను కుట్టే వేగాన్ని లెక్కకట్టి చూచారు. అతను నిమిషానికి 300 కుట్లు వేయగలడని లెక్కలు తేల్చి చెప్పాయి. ప్రదర్శన దిగ్విజయంగా ముగిసింది. కాని ఆ ఫ్యాక్టరీ యజమాని మాత్రం ఆ మిషను పట్ల ఎలాంటి ఆసక్తిని చూపలేదు. ఇద్దరూ - ఫిషరూ, హోవే - వాషింగ్టన్‌కు బయలు దేరారు. 1846 సెప్టెంబరు 10వ తారీఖున హోవే మిషన్‌కు అధికార పత్రం దొరికింది. హోవే మిషన్‌కు - ఆర్డర్లు రాకపోవడంతో ఫిషర్ ఆశలు నిరాశగా మారిపోయాయి. వెంటనే అతను తన ఒప్పందాన్ని రద్దు-చేసుకున్నాడు అప్పటి వరకు ఇస్తున్న భోజన వసతి సౌకర్యాలను హోవే కోల్పోవడంతో పరిస్థితులు మొదటి కొచ్చాయి.

హోవే తన తండ్రి వ్యవసాయ క్షేత్రానికి వెనుదిరిగి వచ్చాడు. తన తమ్ముడు - ఆమాసా హోవే (Amasa Howe) ఇంగ్లాండుకు ప్రయాణం కానున్నాడని తెలుసుకున్నాడు. ఇంగ్లాండులో తన మిషన్‌ను ప్రచారం చేయమని కోరుతూ ఒక మిషన్‌ని తమ్ముడితో కూడా పంపాడు. తమ్ముడు ఆమాసా తన అన్నగారు తయారు చేసిన కుట్టు మిషన్‌ను రవికలూ, గొడుగులు తయారు చేసే విలియమ్ థామస్‌కు 250 డాలర్లకు అమ్మకం చేసాడు. దురాలోచనతో విలియమ్ థామస్ హోవేను ఇంగ్లాండుకు రావల్సిందిగా కోరాడు. కాని అక్కడా చుక్కెదు రవడంతో హోవే ఖాళీ చేతులతో అమెరికాకు తిరిగి వచ్చేసాడు

1850లో హోవే అమెరికాకు తిరిగి వచ్చాడు. కొన్ని మార్పులు చేర్పులతో తాను తయారు చేసిన కుట్టు మిషన్లను ప్రదర్శనశాలలోనూ, సంతలలోనూ ప్రదర్శించడం చూసి హోవే ఆశ్చర్యపడ్డాడు. బజారులో ఉన్న మిషన్‌లు తాను తయారు చేసిన మిషన్లే అయినా ఎక్కడా ఎవరూ తన పేరును వాడకపోవడం హోవే కళ్ళారా చూచాడు. కానీ కొత్తగా మార్కెట్టులో ఉన్న మిషన్ తన మిషను కంటే బాగా పని చేయడం కూడా హోవే చూచాడు.

ఈ కొత్త పరిస్థితుల వెనుక ఐసాక్

**"పురుషులు స్పందించినట్లుగానే స్త్రీలు కూడా స్పందిస్తారు. వారి శక్తి సామర్థ్యాలకు అభ్యాసం మరియు తమ సోదరుల మాదిరిగా ప్రయత్నం చేసేందుకు కార్యక్షేత్రం కావాలి."**

మెరిట్ సింగర్ అనబడే ఒక వ్యక్తి ఉన్నట్లు హొవే తెలుసుకున్నాడు. హొవే అట్టు ఉడికినట్లు వుడికిపోయాడు. ఐసాక్ మెరిట్ సింగర్‌తో తర్జన భర్జనలు జరిగిన తరువాత సింగర్‌తో పాటు కుట్టు మిషన్‌ను తయారు చేసి ఇతరులపై 25,000 డాలర్లకు దావా వేసాడు. అధికార పత్రం పొందిన హొవే ప్రణాళికలే అందరూ వాడుకున్నారు.

A MODERN NEEDLE MACHINE



ప్రతి వొకరూ ఇంకొకరిపై ఆ కారణంగా దావాలు వేసారు. ఆ విధంగా1 850లో కుట్టు మిషన్ సంబంధమైన దావాల యుద్ధం ప్రారంభమైంది ఈ యుద్ధం సుమారు నాలుగు సంవత్సరాలపాటు జరిగింది. 1854లో కుట్టు మిషన్‌ను నిజంగా కనుగొన్న హొవేపరంగా జడ్జి జార్జ్ డబ్ల్యు. బ్లిస్ (George W Bliss) తీర్పునిచ్చాడు. కుట్టుమిషన్‌ను తయారు చేసే హక్కులను సింగర్ కొన్నాడు. అప్పటికి తయారు చేయ బడి అమ్ముడైపోయిన కుట్టు మిషన్లకు గాను నష్టపరిహారంగా సింగర్ హొవేకు 15,000 డాలర్లనిచ్చాడు.

పది సంవత్సరాలలో హొవే మిలియనీర్ అయ్యాడు. అతని ఆదాయం రోజుకు 4,000 డాలర్లకు పెరిగింది. యునైటెడ్ స్టేట్స్‌లోని కనెక్టికట్ వద్ద ఉన్న బ్రిడ్జిపోర్ట్ (Bridgeport)లో హొవే తన తమ్ముడూ మరియు అల్లుడితో కలిసి సొంత కంపెనీ హొవే సూయింగ్ మెషిన్ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ-ను ప్రారంభించాడు.

1867లో ఫ్రాన్స్ దేశం రాజధాని పారిస్‌లో జరిగిన ఒక వస్తు ప్రదర్శన శాలలో హొవేకు అతని నూతన కల్పనను పురస్కరించుకుని బంగారు మెడల్ లభించింది. అప్పటి చక్రవర్తి నెపోలియన్ III కరకమలాల నుండి ఫ్రాన్స్ దేశపు అతి విశిష్ట గౌరవాన్ని - గ్రాండ్ క్రాస్ ఆఫ్ ది లీజియన్ ఆఫ్ ఆనర్ (Grand cross of the Legion of honour) - తన కుట్టు మిషన్ నూతన కల్పన కారణంగా హొవే పొందాడు. ఇది ఒక వ్యక్తి పొందగలిగిన అత్యున్నత సత్కారం. 1867వ సంవత్సరం అక్టోబరు 3వ తేదీన న్యూయార్క్‌లోని బ్రూకిలిన్‌లో 48వ ఏట హొవే మరణించాడు. చనిపోయిన తరువాత అమెరికా ప్రభుత్వం "హాల్ ఆఫ్ ఫేమ్ ఆఫ్ ది గ్రేట్ అమెరికన్స్" - (Hall of Fame of the Great Americans) అన్న గౌరవాన్ని ఇచ్చింది. చనిపోయేటప్పటికి 2,000,000 డాలర్ల విలువ గల సొత్తుకు అతను సొంతదారుడు.

"మనం నివసిస్తున్నది ఒక పురుష ప్రపంచం. **ఆత్మ గౌరవంతో అది** ప్రారంభం కానప్పుడు మన భక్తి గౌరవాలు, పూజ్యభావం నిష్ప్రయోజనమవుతాయి."

— ఓ.డబ్ల్యు. హొమ్స్

# మకావ్ - సుదూర తూర్పు ప్రాంతంలో యూరోపియన్లు స్థిరపడిన అతిప్రాచీన ప్రాంతం

ఆశియా ఖండంలో 'మకావ్' (Macau) ఒక చిన్న పోర్చుగీసు భూభాగం. చైనాకు ఆగ్నేయ కోస్తా ప్రాంతంలో ఉన్న నగరం మకావ్. ఇది కాకుండా తీరానికి దూరంగా ఉన్న రెండు దీవులు కూడా ఉన్నాయి. ఈ ప్రాంతం మొత్తం విస్తీర్ణత 15.5 చ.కి.మీ.లు. ఒక ద్వీపకల్పంపై కేన్‌టన్ నదీముఖం దగ్గర ఈ మకావ్ నగరం నిర్మించబడింది.




మకావ్ ఒక రేవు పట్టణం. ఈ రేవు చేపలు, టీ, నిమ్మదబ్బ పండ్లు, వస్త్రాలు, గుడ్డలు, బొమ్మలు, పొగాకు మొదలైన సరకులకు వ్యాపార కేంద్రం. ఇదొక పర్యటక కేంద్రం. ఇక్కడ ఆసక్తిని కలిగించే చారిత్రాత్మక ప్రదేశాలు చాలా ఉన్నాయి. అందులో ముఖ్యమైనది - సెంట్ పాల్స్ శిథిలాలు, కున్‌యామ్ దేవాలయం, ది బార్డర్ గేటు మరియు పెన్‌హాల్ కొండ. జగత్ప్రసిద్ధి గాంచిన ఉద్రూతలూగించే పారిస్ షో మరియు కాసినోలకు (జూదశాలలు) ఈ నగరం పేరుపొందింది.

మకావ్ నగరం జనాభా సుమారుగా 500,000 దాకా ఉంటుంది. ఇందులో చాలాభాగం జనం చైనీయులు. అక్షరాస్యత నూటికి నూరుపాళ్ళు. సముద్రానికి ఆవలి వైపున్న పోర్చుగల్ (పడమటియూరప్)కు చెందిన ఈ ప్రాంత పరిపాలకులు పోర్చుగీసు వారే. ఇది సుదూర తూర్పు ప్రాంతంలో నెలకొల్పబడిన యూరోపియన్ల భూభాగం 1557 ప్రాంతంలోనే యూరోపియన్లు ఇక్కడ తమ స్థిర నివాసాన్ని ఏర్పరచుకున్నారు. ఇక్కడ తూర్పు పడమరల సంస్కృతుల మధ్య గత నాలుగు వందల సంవత్సరాలుగా ఇచ్చి పుచ్చుకోవడం జరుగుతూ వస్తున్నది.

1976 వ సంవత్సరం పోర్చుగల్ దేశం ఈ ప్రాంతానికి - బృహత్ స్వయం పాలనా అధికారాన్ని ఇచ్చింది 1987లో చైనా పోర్చుగల్ దేశాల పరస్పర ఒప్పందం ప్రకారం 1999 నాటికి ఈ మకావ్ చైనా దేశపు భూభాగంగా మారబోతున్నది.

"ప్రజాభిప్రాయానికి సంబంధం లేకుండా ఒకరి విద్యుక్త ధర్మ నిర్వహణ ఉండాలి."
— గాంధీజీ

# మన పూర్వీకులు సాధించిన ఘనకార్యాలు

## కృత్రిమ జలపాతం

ఏ.ఆర్. షరీఫ్

మహారాష్ట్రకు చెందిన ఔరంగాబాదు ఒక సుప్రసిద్ధ పట్టణం. బహుళ ప్రచారాన్ని పొందిన 'పన్‌చక్కి' జల కర్మాగారం ఈ పట్టణంలోనిదే. ఈ సంక్లిష్ట నీటికాలువ



నిర్మాణం 300 సంవత్సరాల క్రిందట జరిగింది. ఈ నిర్మాణం మధ్య యుగానికి చెందిన మన పూర్వీకుల ఇంజినీరింగు నైపుణ్యానికి నిదర్శనంగా నిలిచింది. ఈ జలకర్మాగారం యొక్క ముఖ్యమైన భాగం గత 300 సంవత్సరాలుగా ఎడతెఱపి లేకుండా వస్తున్న ఒక అనంతమైన కృత్రిమ జలపాతం.

ఈ జలకర్మాగారంకు కావల్సిన నీరు అక్కడికి సుమారు 4 మైళ్ళ దూరంలోనున్న బావి నుండీ లభిస్తున్నది. ఈ బావి రెండు నదుల సంగమస్థానానికి దగ్గరలో ఉన్నది. అక్కడి నుండి నీరు మట్టితో చేయబడిన గొట్టాల ద్వారా భూమార్గంగా నీటి కాలువకు చేరవేయబడుతుంది. జలపాతం దగ్గర ఈ నీటి గొట్టాలు సైఫన్లుగా (నీళ్ళు పీల్చు వంపు గొట్టాలు) మారి నీటి మట్టాన్ని బాగా పెంచుతాయి చూపరులకు తాపీ పనివారు కట్టిన దీర్ఘ చతురస్రాకారపు స్తంభంగా ఈ నీటిమట్టం కనపడుతుంది నీటిమట్టం ఈ స్తంభం పైభాగం చేరగానే జలపాతంలా దూసుకుంటూ క్రిందనున్న కొలనులో పడుతుంది. నీటితో నిండిన ఆ కొలను తళతళామెరుస్తూ ఉంటుంది. ఇప్పటివరకు ఏమాత్రం ఒడుదుడుకులు లేకుండా ఈ పద్ధతి కొనసాగుతూ వస్తూనే ఉంది. ఇది నిజంగా ప్రశంసనీయమైనది. నీళ్ళను చేరవేయడానికి వాడిన మట్టిగొట్టాలు కూడా ఈ రోజుకూ చెక్కుచెదరలేదు. ఇది ఇంకా ప్రశంసనీయమైన సంగతి. ఈ గొట్టాలు మూడు వందల సంవత్సరాలుగా నీటిని సరఫరా చేస్తూ వస్తున్నాయి. దీనికి కావలసిన నీటివనరులు కరువు కాటకాల కాలంలో కూడా ఎండకుండా వస్తున్నాయి.

పన్‌చక్కి సంక్లిష్ట జలకర్మాగారానికి

(మిగతా 38 వ పేజీలో)

"కేవలం భయంవల్ల దేవుణ్ణి పూజించేవారు, ప్రత్యక్షమైతే - దయ్యాన్ని కూడా పూజిస్తారు." — థామస్ ఫుల్లర్

ఒక వ్యాపారికి ఇద్దరు కొడుకులు. అతనికి పెద్ద కొడుకంటే ఇష్టం. అందుకే మరణానంతరం తన ఆస్తికి పెద్ద కొడుకునే వారసుణ్ణి చేయదలిచాడు. కాని తల్లికి చిన్న కొడుకంటే పంచప్రాణాలు. వాడిపట్ల ఆమెకు అమితమైన జాలి. 'ఈ విషయం చిన్నవాడికి తెలియజేయకండి' అని ఆమె భర్తను ప్రార్థించింది. ఇద్దర్ని సరి సమానులుగా చేసేందుకు మార్గం త్వరగా తప్పక లభించగలదని ఆమె ఆశించింది.



భార్య ఆవేదనను భర్త అర్థం చేసుకున్నాడు. తన మనసులోని మాటను కొడుకులకు తెలియజేయనని భార్యకు మాటిచ్చాడు.

ఒక రోజు... తల్లి కిటికీ దగ్గర కూర్చుని కంటతడిబెట్టింది. కన్నీరు కారుస్తున్న ఆ తల్లిని దారినిపోయే యాత్రికుడు చూశాడు. ఆమె ఏడుపుకు కారణం కనుగొందామని ఆ యాత్రికుడు కిటికీని సమీపించి "అమ్మా! మీరు ఎందుకు ఏడుస్తున్నారు" అని ప్రశ్నించాడు.

"ఏడవకుండా ఎలా ఉండమంటారు బాబు. నా ఇద్దరు కొడుకులు రెండుకళ్ళతో సమానం. నా దృష్టిలో ఇద్దరికి తేడా లేదు. కానీ నా భర్త దృష్టే వేరు. ఆయన యావదాస్తికి పెద్ద కొడుకునే వారసుణ్ణి చేయాలనుకుంటున్నారు పాపం చిన్న వాడికి చిల్లిగవ్వ కూడా దక్కదు. ఈ సమస్యకు పరిష్కారం దొరకనంత వరకు వారిద్దరికి తన మనసులోని మాటను చెప్ప వద్దని నా భర్తను ప్రార్థించాను. నా దగ్గర చూస్తేనాది అనదగ్గ ఆస్తి లేదు. ఈ విచార సమయంలో ఏం చేయాలో తోచడం లేదు"అని తన బాధను యాత్రికునికి తెలియజేసింది.

యాత్రికుడు కాసేపు ఆలోచించి

( 37 వ పేజీ తరువాయి)

ఆధారం ఒక కృత్రిమ జలపాతం, రెండు పెద్ద సరస్సులూ, ఒక జలయంత్రం అక్కడున్న జలయంత్రం కారణంగానే అక్కడి నీటి కాలువకు ఆ పేరు వచ్చింది బాబా షా ముసాఫిర్ అనే ముస్లిం ఫకీరు ఆశ్రమం ఈ పన్‌చక్కి ప్రాంతంలోనే ఉంది. బాబా షా ముసాఫిర్ క్రీ.శ. 1714లో పరమపదించారు.

"ఇచ్చే డబ్బు మొత్తాన్ని బట్టి ఉదారత ఉండదు - అది ఇచ్చే పద్ధతిని

"చూడమ్మా. నీ సమస్యకు ఒకే ఒక పరిష్కార మార్గం ఉంది. కొడుకులను ఇద్దర్నీ పిలిచి నిజం చెప్పు. ఆస్తి పెద్దవాడికి మాత్రం లభిస్తుందనీ, చిన్నవాడికి పిత్రార్జితం నుండి చిల్లిగవ్వ దొరకదని ఏమాత్రం సంకోచం లేకుండా చెప్పు తల్లి. అలాచేయడం వల్ల ఇద్దరూ సమానులవుతారు" అని సలహా ఇచ్చాడు.



చిన్న కొడుక్కు అసలు విషయం తెలిసి పోయింది. తనకు దమ్మిడీ కూడా దొరకని చోట ఉండీ లాభం లేదని ఇల్లు వదిలి వెళ్ళిపోయాడు దూర ప్రాంతానికి వలసపోయి అక్కడ అనుభవాన్ని సంపాదించాడు. వ్యాపారంలోని మెలకువలను తెలుసుకుని స్వంతంగా వ్యాపారాన్ని ప్రారంభించాడు క్రమంగా వృద్ధిలోకి, రాగలిగాడు.

పెద్దకొడుకు తండ్రిదగ్గరే ఆకుచాటు పిందెలా ఉండిపోయాడు. ఏ ఒక్క విద్యను నేర్చుకోలేకపోయాడు. కారణం ఒకరోజు కాక పోతే మరో రోజు నేను ధనవంతుణ్ణి కాగలనన్న నమ్మకమే.

తండ్రి చనిపోయాడు వ్యాపారం ఎలా చేయాలో తెలియనందువల్ల పెద్దకొడుకు ఆస్తి హారతి కర్పూరంలా హరించుకపోయింది. సంక్రమించిన ఆస్తిని త్వరలో పోగొట్టుకున్నాడు. చిన్నవాడు మాత్రం దూర ప్రాంతానికి పోయి వ్యాపారంలోని మెలకువలను నేర్చుకుని ధనవంతుడయ్యాడు.

— లియో టాల్‌స్టాయ్

## అతి ఎత్తైన పోలింగు కేంద్రం

*ఉత్తరప్రదేశ్‌లోని కుంతి గ్రామం సముద్ర మట్టానికి సుమారు 13,500 అడుగుల ఎత్తున ఉంది. ఆకారణంగా 1 0 వ లోక్‌సభకు గాను 1991 లో జరిగిన ఎన్నికలలో ఈ పోలింగ కేంద్రం అతి ఎత్తైన పోలింగ్ కేంద్రం అయింది పిథోరాఘర్ జిల్లా కేంద్రం నుండి ఎన్నిక అధికారులు బస్సు, నడకల ద్వారా 9 రోజుల ప్రయాణం చేసి పోలింగు కేంద్రాన్ని చేరగలిగారు*

## నిమిషానికి 250 పదాల షార్ట్‌హేండ్

రాజ్యసభ సీనియర్ రిపోర్టరుగా పనిచేస్తున్న శ్రీ జి.డి. బిష్త్ ఒక నిమిషానికి 250 పదాల చొప్పున సంకేత లిపి (షార్ట్‌హేండ్) లో హిందీను రాయగల సమర్థులు.

"అజ్ఞానం తరచుగా క్షమార్హమౌతుంది. కానీ అజ్ఞానంగా ఉండాలనే పట్టుదల క్షమార్హం కాదు." — పాల్ బ్రంటన్

ఒకర్ని పడద్రోయడం, నిలబెట్టడం కంటే చాలా సులువు.

ఒక పెద్ద కట్టడాన్ని పడద్రోయటాన్ని చూచారా? ఆ పని మీకు చాలా సాధారణమైన పనిగా కనబడి ఉంటుంది. కట్టడాన్ని కట్టడానికి చాలా నెలలు పడుతుంది. కానీ పడగొట్టడం చాలా త్వరగా కొన్ని క్షణాలలో జరిగిపోతుంది. ఇదే నియమం మన జీవితాలకు కూడా వర్తిస్తుంది. ఎత్తుకు ఎదగడానికి మనం ఎంతో శ్రమిస్తాం. మన పురోగతికి అవరోధాలనుకున్న గుణాలను ద్వేషం, దురాశ, కోపం ఇత్యాది - వదల్చుకోడానికి ప్రయత్నిస్తాం. తరువాత మంచి గుణాలను - ప్రేమ, సంతోషం, సహనం - అలవర్చుకుంటాం.

ఈ విషయాలలో జాగ్రత్త అవసరం ఎంతైనా ఉంది. బయటి నుండి మనపై ఆక్రమణ చేసే శక్తుల (ఉదాహరణకు చెడు సహవాసం) విషయంలో జాగ్రత్తగా ఉండాల్సి ఉంటుంది. అంతేకాదు మన చెడు అలవాట్లవైపు కూడా మన దృష్టిని సారించవలసి వస్తుంది. ఆ అలవాట్లు మనలో అంతర్భాగం అయ్యేలా వెనుతిరిగి వస్తాయి. అప్పుడు "అవును అలాగే ఉండటం నా స్వభావం. నేను చేయలేను" అనుకుంటూ మనల్ని మనం సమాధాన పరచుకుంటాం. మనల్ని దెబ్బ తీస్తున్నదేదో తెలుసుకొనే లోపుగానే మన జీవితం ముగిసిపోతుంది. అంతవరకు మనం సాధించినదంతా పేకమేడలా కూలిపోతుంది.

మనలో చాలా మంది గతాన్ని గబ్బిలంలా పట్టుకుని వ్రేలాడుతుంటాం. గతాన్ని పట్టుకుని వ్రేలాడుతున్నంత వరకు వర్తమానం కష్టతరం అవుతుంది. భవిష్యత్తు అసాధ్యమవుతుంది.

— బి.కె. రాజయోగ కేంద్రం సౌజన్యంతో

## రక్తసేకరణలో మార్గదర్శి




డా. చార్లెస్ ఆర్. డ్రూ పేరెన్నికగన్న శాస్త్రజ్ఞుడు ఆచార్యుడు మాత్రమే కాదు గొప్ప శస్త్ర చికిత్సకుడు కూడా. హెచ్చు పరిమాణంలో రక్తప్లాస్మాను ఎలా నిలువ చేయవచ్చో అతను మొదట్లో కనుగొన్నాడు. ఆ తరువాత ఆ పద్ధతిని వికసింప జేసాడు ఇతడు నల్లజాతికి చెందిన యువవైద్యుడు. రక్తసేకరణకు, ప్లాస్మా ప్రాసెసింగ్‌కు ఆద్యుడిగా పరిగణింపబడుతున్నాడు — కవితారాయ్, సైన్స్ రిపోర్టర్

"మూడుపనులు మాత్రం తొందరపెడతాయి. - కుమార్తె వివాహం, మరణించిన వానిని పూడ్చటం మరియు అతిథికి భోజనం సమకూర్చటం."

# కూలిపోతున్న కుటుంబ వ్యవస్థ

వాధూల

మానవులలోనూ, జంతువులలోనూ అమూల్యమైన కుటుంబ వ్యవస్థ అనాదిగా ఏర్పడిందే. పవిత్రమైన కుటుంబ వ్యవస్థ లోపించినప్పుడు మానవుడు నట్టేటిలో తేలుతూ గాలి ఎటువీస్తే అటు కొట్టుకు పోయే పడవవంటి. వాడవుతాడు. నేడు ఈ కుటుంబ వ్యవస్థ మానవజాతిలో



అంతరించిపోయే విపరీత పరిస్థితులు ఏర్పడుతున్నాయి. కుటుంబాలు ఛిన్నాభిన్నమై ఎక్కడికక్కడ విడిపోతున్నాయి. ఒకప్పుడు పెద్ద పెద్దవిగా ఉన్న కుటుంబాలు క్షీణించి,ఇద్దరే ఇద్దరు వ్యక్తులతో అణు కుటుంబాలుగా తయారవుతున్నాయి. ఇటువంటి పరిస్థితులు మనదేశంలోనే కాదు, ప్రపంచ వ్యాప్తంగా విస్తరిస్తున్నాయి. ఇది గ్రహించి యునైటెడ్ నేషన్సు, 1994వ సంవత్సరాన్ని అంతర్జాతీయ కుటుంబ సంరక్షణ సంవత్సరంగా పరిగణించింది.

కుటుంబ వ్యవస్థ శిథిలమై పోవడానికి గల కారణాలను గ్రహించి, సకాలంలో తగిన చర్యలు చేబడితే పవిత్రమైన కుటుంబ వ్యవస్థను సంరక్షించ గలుగుతాము. దీనికి ఆయా కుటుంబాలలోని వ్యక్తులు తమతమ భావావేశాలను, పరస్పర సహకార సౌహార్ధాలను జాగ్రత్తగా కనిపెట్టి తీర్చి దిద్దుకుంటూ ఉండాలి. వ్యక్తిగత సుఖ సంతోషాలతో తులతూగుతూండే కుటుంబమే సలక్షణమైన జాతికి ప్రాతిపదిక. పిల్లలను తగురీతిలో పెంచి పెద్దవారిగ చేయడానికి కుటుంబం ఒక విశిష్ట శిక్షణాకేంద్ర మని మరువకూడదు.

ఒకప్పుడు పరస్పర ప్రేమ ఔదార్యాలతో వర్ధిల్లుతూన్న యువదంపతుల మధ్య

---

## మరో వంద సంవత్సరాల్లో 50 బిలియన్లకు పెరగనున్న ప్రపంచ జనాభా

*ప్రతి సంవత్సరం 2 శాతం ప్రకారం మన జనాభా ఇప్పటిలా పెరుగుతూపోతే రాబోయే వంద సంవత్సరాల్లో ప్రపంచ జనాభా 50 బిలియన్లకు పెరగగలదు*

— బెంజమిన్ జుకర్‌మాన్

జీరో పాపులేషన్ గ్రోత్ - సభ్యుడు

---

"నీవెలాంటి వాడివని అతడు భావిస్తున్నాడో దాన్నిబట్టి ఒక వ్యక్తి నిన్ను ఇష్టపడతాడు. ఆమె ఎలాంటిదని నీవు భావిస్తున్నావో దాన్ని బట్టి ఒక స్త్రీ నిన్ను ఇష్టపడుతుంది."

— ఇవాన్ పాజిన్

వైరుధ్య భావాలు పొడచూపుతున్నాయి. అనేక కుటుంబాలలో భార్యాభర్తలు ఎడముఖం, పెడముఖాలతో మాట్లాడుకోరు. తమ పిల్లలను ఆయాల చేతికి అప్ప చెబుతున్నారు. కని పెంచిన ముసలి తలిదండ్రులను భారంగా భావిస్తున్నారు. వారిని వృద్ధాశ్రమాలకు పంపుతున్నారు









ఇక భార్యాభర్తలు ఇద్దరూ ఉద్యోగాలు చేసే కుటుంబాలలోని పరిస్థితులను వేరే చెప్పాలా? బడలిక వల్ల, ఇంట్లో అదనపు పనుల వల్ల, విసుగుదల, కోపం, నిరుత్సాహం పెరిగి పోతున్నాయి మరికొన్ని సందర్భాలలో త్రాగుడు మొదలైన దురభ్యాసాలవల్ల, ఆర్థిక పరిస్థితులు లోపించడం వల్ల, ఆత్మ గౌరవానికి హాని కలగడం వల్ల, పరస్పరం అవిశ్వాసం పెరగడం వల్ల, కుటుంబాలు విచ్ఛిన్నమై పోతున్నాయి

ఇటువంటి పరిస్థితులలో చిన్న పిల్లలకు తీరనిహాని సంభవిస్తున్నది. పిల్లల లేత మనస్సులు చెదిరి పోతున్నాయి. సహజమైన దయా దాక్షిణ్యాలు, అనురాగం, ప్రేమ, ఔదార్యం లోపించడం వల్ల పిల్లలు ఈర్ష్య, అహంభావం, అసహనం, ఓర్వలేనితనంతో పెరుగుతున్నారు. ఈపిల్లలు పెద్దవారై నప్పుడు కూడా ఈ లక్షణాలే వారిలో ప్రకటిత మౌతున్నాయి.



## మృత శరీరాల్లోని శవపేటిక ఈగ

*ఖననం (భూమిలో పూడ్చడం) చేయబడిన మృత శరీరాల్లో శవ పేటిక ఈగలు ఉంటున్నాయి. కానీ ఈ ఈగలు ఈ శరీరాల్లో ఎలా జొరబడు తున్నాయన్నది ఒక విచిత్రం*

## తలక్రిందులుగా కూర్చొనే ఈగ ఆహారం

*తలక్రిందులుగా కూర్చొనే ఈగ యొక్క ఆహారం ఏమై ఉంటుందో కీటకశాస్త్ర ప్రవీణులు తెలుసుకోలేకపోతున్నారు. ఈ ఈగలు ఏమి తింటాయో వీరు ఇదమిత్థంగా తేల్చి చెప్పలేక పోతున్నారు. చెట్టు బోదెపై ఇది గంటల తరబడి తలక్రిందులుగా ఎలాంటి కదలిక లేకుండా కూర్చోగలదు మరి ఈ ఈగ ఏమి తింటుందో, ఎలా తింటుందో, ఆ పరమేశ్వరుడికే ఎఱుక.*

## చమురు బావులలో పెట్రోలియం ఈగలు

*కాలిఫోర్నియా (అమెరికా)కు చెందిన చమురు బావుల్లోనే మనం ఈ పెట్రోలియం ఈగలను చూడగలం. మడ్డి నూనెలో ఇరుక్కు పోయిన క్రిములను తిని ఈ ఈగలు తమ పొట్టను పోషించుకుంటాయి.*

"పశుప్రాయుడైన మనిషి నుంచి మనల్ని వేరు చేసేవి - క్రమశిక్షణ మరియు నిగ్రహం."
— గాంధీజీ

ఒక కుటుంబంలో తల్లిదండ్రులు పిల్లలను తీర్చిదిద్దే తీరూ, తెన్నూ వారి భావి మనుగడకు ఎంతో సహకరిస్తూంది. ఏ కుటుంబంలో నైనా పిల్లలు పెద్దలను అనుకరిస్తారు. కాబట్టి మొట్టమొదట తల్లి దండ్రులు అన్యోన్యతతో జీవించటం నేర్చుకోవాలి. జీవిత విధానంతో సంతృప్తి పడాలి. పిల్లలు కుటుంబంలో ఉత్సాహంతో, ఆనందంతో పెరగాలంటే ఇంట్లో అందరిలోను మంచితనం, మమకారం ఉండాలి ఆసక్తి, అభిలాష, అభినివేశం అందరిలోనూ ఉంటే కుటుంబం- నిత్య కళ్యాణం పచ్చ తోరణంగా కళకళలాడుతూ ఉంటుంది.

పిల్లలు చెప్పేదానిని, చేసే దానిని శ్రద్ధగా వింటూ, చూస్తూ వారికి మంచి చెడ్డలు చెప్పాలి. ఓపికతో, సహనశక్తితో, ప్రేమాభిమానాలతో వారిని పెంచాలి. పిల్లలు యౌవ్వనంలోకి వస్తూంటే వారిని మరింత జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి.

మనం మానవ మాత్రులం. సహజంగా తప్పులు చేస్తుంటాము. పరస్పరం తప్పులను మన్నిస్తూ కలసిమెలసి ఉంటేగాని కుటుంబాలు వర్ధిల్లవు. కుటుంబంలో సామరస్యం కుదిరినప్పుడే శాంతి భద్రతలు ఏర్పడతాయి కుటుంబంలోని వ్యక్తులలో ఉత్సాహ తరంగాలు లేచినప్పుడే కుటుంబం నవ్యకళతో వికసిస్తుంది.

పిల్లలు తల్లిదండ్రులను గౌరవించాలి, ఆదరించాలి. అన్నతమ్ములలో, అక్క చెల్లెళ్ళలో వివాదాలకు, పరస్పర అనుమానాలకు తావు ఉండకూడదు. అప్పుడే కుటుంబ వ్యవస్థ వర్ధిల్లుతుంది.

కుటుంబ వ్యక్తులతో కలిసిమెలసి ఉండు. ఎవరి మనస్సుకు కష్టం కలిగించకు, నెమ్మదిగా మాట్లాడు. కుటుంబంలోని వ్యక్తులను మెచ్చుకుని, అభినందించు. కుటుంబ ధర్మాలను అనుసరించు, బాధ్యతలను నిర్వహించు. అప్పుడే అంతరించి పోతున్న కుటుంబ వ్యవస్థ సంరక్షించ బడుతుంది కుటుంబం ఒక స్వర్గధామం అవుతుంది.

## ఏ ఒక్కరూ తప్పించుకోలేరు




మనం చేస్తున్న పనులకు లభించే ఫలితం నుండి ఏ ఒక్కరూ తప్పించుకోలేరు. తప్పించుకునేందుకు ఆకాశంలో గాని, లేదా సముద్రపు లోతులలో గాని, లేదా పర్వతాల గుహలలోగాని దాగినా లాభంలేదు. ఫలితం అనుభవించి తీరాల్సిందే

— బుద్ధుడు

''చాలా సాదువుగా ఉంటే - నీవు పిండివేయబడతావు. చాలా కఠినంగా ఉంటే, విరగగొట్టబడతావు.'' — అరబిక్ సూక్తి

నడక, అతివేగంగా ప్రపంచ మొత్తంలో అందరికి ప్రియమైన వ్యాయామంగా మారుతోంది. ఆరోగ్యంగా ఉండేందుకు కఠినమైన పరిశ్రమ, తీవ్రతరమైన కార్యక్రమాలను చేపట్టవలసిన అవసరం లేదని పరిశోధకులు తమ పరిశోధనల మూలంగా నిరూపించారు.





వ్యాయామం చేసే వారు శ్రమిస్తున్నప్పుడు వారి గుండె 70 లేక 85 శాతం వరకు ఎక్కువగా పనిచేస్తుందని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు కానీ ఆరోగ్యంగా ఉండేందుకు గుండె 60 శాతం శ్రమిస్తే చాలని వారి పరిశోధనలు చెబుతున్నాయి. శరీరాన్ని ఆరోగ్యవంతంగా ఉంచుకొనడం నడక ద్వారా చాలా సులభం. అంతేకాదు శరీరంలో పేరుకుపోయిన అనవసరపు కొవ్వును వదిలించుకోవడానికి నడక అతి సులువైన మార్గం.

శ్రమించిన వెంటనే కాకుండా15 నిమిషాల తరువాతనే శరీరం ఎక్కువగా పేరుకుపోయిన కొవ్వును దహించగలదు. అంటే 20 నిమిషాల కష్టమైన పనికి ప్రతిఫలంగా5 నిమిషాల కాలం కొవ్వు దహించబడుతుంది. కాని 60 నిమిషాల సాధారణ నడక వల్ల 45 నిమిషాల కాలం కొవ్వు దహించబడుతుంది.

60 నిమిషాల సాధారణ నడక (సుమారు 6.5 కి.మీ.) ద్వారా390 కాలరీలను మనం దహించగలుగుతాం. ఈ నడకను మనం గంటకు 8 కి.మీ.ల వరకు పెంచగలిగితే మనం 530 కాలరీలను దహించగలుతాము.

వయసు మళ్ళిన తరువాత ఆరోగ్యంగా ఉండాలనుకున్నప్పుడు నడకకు మించిన ఆసక్తికరమైన మార్గం లేదు. శరీరంలోని ఊపిరితిత్తులను, కాళ్ళను ఇతర కండరాలను నడక బలంగానూ, స్థిరంగానూ ఉంచగలదు. నడక హృదయాన్ని దృఢపరచి, హృదయ వ్యాధులు వచ్చే అవకాశాన్ని తగ్గిస్తుంది పరిశోధకులు నడక రక్తపోటునూ, కొలెస్ట్రాల్ స్థాయినీ తగ్గించగలదని సూచిస్తున్నారు.

క్రింద కనబరచిన చిట్కాలను పాటించి నడక లాభాలను పెంచుకోండి.

*నడక లేక ఇతర వ్యాయామాన్ని చేపట్టడానికి ముందు మీ వైద్యుణ్ణి సంప్రదించండి.

మంచి జోళ్ళను మేజోళ్ళను

వాడండి. నడకకు ఉపయోగపడే అనేక రకాల జోళ్ళు ఉన్నాయి. మంచి రకం మేజోళ్ళు కాళ్ళకు బొబ్బల నుండి రక్షణను కల్పిస్తాయి. కాళ్ళకు కావల్సిన అదనపు మెత్తదనాన్ని ఇచ్చి చెమటలను హరింప జేస్తాయి.

* నిదానంగా వ్యాయామాన్ని చేయండి. ప్రారంభంలో 19 నిమిషాలకు ఒక కిలో మీటరు చొప్పున నడవడం మంచిది. కొన్ని రోజుల తరువాత నడక వేగాన్ని, దూరాన్ని పెంచండి.

* నడకను ప్రారంభించే ముందు శరీరంలోని కండరాలను వదులు చేసుకునేందుకు తేలికైన వ్యాయామం చేయండి. మెడను సాగతీసేందుకు మీ తలను ఒక వైపునుండి మరొక వైపుకు త్రిప్పండి. మీ భుజాలను ఎత్తి మీ చేతులను చాపండి. పిరుదులను, మోకాళ్ళ వెనుకనున్న భాగాన్ని (Calves), కాలి చీల మండలాన్ని చాచి వంచండి.

* అభ్యాసం కోసం నడుస్తున్నప్పుడు నిటారుగా నడవండి. దీర్ఘంగా, క్రమ బద్ధంగా ఊపిరిని పీల్చండి. అదనపు త్రోపు కోసం మీ చేతులను ముందుకు వెనుకకు ఊపండి.

* మీ గమ్యాన్ని చేరుతున్నప్పుడు నడక వేగాన్ని తగ్గించి సేద తీర్చుకోండి. బిగిసిన కండరాలను ఒదులు చేసుకునేందుకు తేలిక వ్యాయామం చేయండి. అలా చేసినప్పుడే గుండె కొట్టుకోవడం విశ్రాంతి సమయంలో ఉన్న స్థితికి రాగలదు.

నడక రోజురోజుకు ప్రజాదరణ పొందుతున్నందు వల్ల నడక పట్ల ప్రజల్లో ఆసక్తి పెరుగుతోంది. ఆరోగ్యంగా ఉండడం కోసం ఇంతకు ముందులా శ్రమించి కష్టపడవలసిన అవసరం లేదని ప్రజలు తెలుసుకోగలిగారు.

—"ఎక్జిక్యూటివ్ బుల్లెటిన్" సౌజన్యంతో

## మధుమేహం అరికట్టే వెల్లుల్లి



*కేరళ విశ్వవిద్యాలయానికి చెందిన జీవ రసాయన శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం వెల్లుల్లిలో మధుమేహ నివారణ ఔషధాలు ఉన్నాయని, దీన్ని తరచుగా భుజిస్తే రక్తంలో గ్లూకోస్ స్థాయిల్ని తగ్గించగలదని తెలుస్తున్నది. వెల్లుల్లిలో మధుమేహ నివారణకు కారణమైనది - దీనిలోని గంధకం (సల్ఫర్)తో కూడిన అమినో-ఎస్-ఆల్యిల్ యాసిడ్ సైస్టిన్ సల్ఫాక్సైడ్ (ఎస్ఏసిఎస్) పేన్క్రియాస్ చేత ఇన్సులిన్ స్రావం పెంపొందించటమో లేదా పెరిఫిరల్ టిష్యూలకు బ్లడ్ గ్లూకోజ్ సరఫరాను పెంచటమో చేస్తుందని విశ్వసించబడుతున్నది.*

'నీవు ఎదురు చూడని దాన్ని ఎదురు చూసేంత వరకు నీవు పరిపక్వమైనట్లు కాదు.''

## కె.వి. రంగనాథాచార్

### తలసరి ఆదాయం బాగా ఎక్కువగా ఉన్న దేశం జపాను

దారిద్ర్యాన్ని పారద్రోల వచ్చునన్న సత్యాన్ని నిరూపిస్తున్న దేశం ఆసియా ఖండంలోని జపాను. సాంకేతికపరంగా పరిశ్రమల ఆర్థిక రంగంలో అద్భుత ప్రగతిని సాధించిన ఏకైక దేశం జపాన్. ఈ రోజు జపాను దేశంలోని ప్రజల తలసరి ఆదాయం సుమారుగా2 5,430 డాలర్లు. ఈ తలసరి ఆదాయం బాగా అభివృద్ధి చెందాయనుకుంటున్న దేశాల - అమెరికా (21,790 డాలర్లు), కెనడా (19,500 డాలర్లు), జర్మనీ (21,475) - తలసరి ఆదాయం కంటే చాలా ఎక్కువ.

### 99 శాతం అక్షరాస్యుల దేశం జపాను

జపాను దేశంలో విద్యకు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. విద్య వారి సర్వతో ముఖాభివృద్ధికి తోడ్పడగలదన్న సత్యాన్ని గ్రహించిన దేశం జపాను అక్కడి అక్షరాస్యుల శాతం 99. పరిశ్రమలలో కూడా ఉన్నత విద్యార్హతలున్న వారినే ఎన్నుకుంటారు. దేశంలోని 1/3 శాతం యువకులు ఉన్నత విద్యను అభ్యసిస్తారు.

*తాత్పర్య రచన: యామిజాల పద్మనాభస్వామి*

*కొఱగాని కొడుకు పుట్టిన*
*కొఱగామియెకాదు తండ్రి గుణముల జెరచున్*
*చెఱకు తుద వెన్ను పుట్టిన*
*చెఱకున తీపెల్ల చెఱచు సిద్ధము సుమతీ!*

*(మంచి నడవడి లేని కొడుకు వల్ల వాడు చెడిపోవటమేకాదు తండ్రికి ఉన్న మంచి పేరు కూడా చెడగొట్టిన వాడౌతాడు. చెఱకు కొనను పుట్టిన వెన్ను చెఱకుకు ఉన్న తీపిని పోగొట్టుతుంది. (ఇక్కడ చెప్పవలసే మాట - పసితనం నుంచి పిల్లలను కన్న తల్లిదండ్రులు తగిన శిక్షణతో పెంచాలి. వారు చేసే చెడు పనులను అదలించి, బెదిరించి మానిపించాలి.)*

* *

*చీమలు పెట్టిన [illegible]లు*
*పాముల కిరవైనయట్లు పామరుడు తగన్*
*హేమంబు కూడబెట్టిన*
*భూమీశుల పాలజేరు భువిలో సుమతీ!*

*(చీమలు ఎంతో కష్టపడి మన్నుకూర్చి పుట్ట పెడతాయి. కాని దానిలో ఉండవు ఆ పుట్ట పాముకి నివాసం అయిపోతుంది తెలివితేటలు లేనివాడు కష్టపడి సంపాదించి మూటకట్టి దాచుకున్న ధనం చివరకు ఆదాయం పన్ను వసూలు చేసే అధికారుల చేతుల్లోకి వెళ్ళిపోతుంది. సంపాదించిన ధనమును తాను అనుభవించాలి. అవసరానికి అడిగే వారికి కొంతైనా సహాయం చెయ్యాలి.)*

"బాగా లాభం సంపాదించుకునేవాడు, బాగా ఖర్చుపెట్టేవాడు అయిన వ్యక్తికి జమాఖర్చు లెక్కలు అవసరం లేదు."

# కంటికి లేజర్ శస్త్ర చికిత్స

కంటి లేజర్ (పొందికగల కిరణ ప్రసారణ చేయుటకు ఉపయోగ పడే కాంతి పుంజం) శస్త్ర చికిత్స ఇప్పుడు బహుళ ప్రచారంలో ఉంది. ఈ ప్రగతి ఇలానే వేగం పుంజుకున్న పక్షంలో రాబోయే పది సంవత్సరాలలో 45 సంవత్సరాల లోపు వ్యక్తులకు కంటి అద్దాలు కాని, కాంటాక్ట్ లెన్స్‌ల అవసరం కాని ఉండదు.



లేజర్ శస్త్ర చికిత్స అద్భుతాలను సాధించగలదని లండన్‌కు చెందిన యునైటెడ్ మెడికల్ మరియు డెంటల్ స్కూలు పరిశోధకులు నమ్ముతున్నారు. పై సంస్థలలో హ్రస్వదృష్టిని, సరిదిద్దేందుకు ఈ లేజర్ శస్త్ర చికిత్సను ఉపయోగిస్తున్నారు ఈ సౌకర్యాన్ని దీర్ఘ దృష్టిని సవరించేందుకూ ఆస్టిగ్‌మాటిజమ్ (Astigmatism - కంటి నిర్మాణ సంబంధమైన లోపం)ను సరిచేసేందుకు కూడా పొడిగించాలని పరిశోధకులు ప్రయత్నాలు చేస్తున్నారు.

హ్రస్వదృష్టిని, లేజర్ శస్త్ర చికిత్స ద్వారా సరిచేయడంలో డాక్టర్లు 95 శాతం సఫలమయ్యారు. అదేవిధంగా దీర్ఘదృష్టి సరిచేయడానికి కూడా ఈ లేజర్ శస్త్ర చికిత్స ఉపయోగ పడగలదని డాక్టర్లు విశ్వాసంతో ఉన్నారు.

కంటి ముందు భాగంపైనున్న సూక్ష్మమైన

## రెండుతరాల వరకు క్రికెట్ టెస్ట్ మాచ్ ఆడిన ఆటగాడు

*ఇంగ్లండుకు చెందిన రోడ్స్ విల్‌ఫ్రెడ్ (Rhodes Wilfred) 1899 లో మొట్టమొదటిసారి టెస్ట్ మాచ్ ఆడాడు 1926 లో ఆఖరుసారిగ చాప్‌మాన్ (Chapman) నాయకత్వంలో ఆడాడు రోడ్స్ విల్‌ఫ్రెడ్ మొదటి టెస్ట్‌మాచ్ ఆడినప్పటికి చాప్‌మాన్ ఇంకా పుట్టలేదు*

## ప్రతి మనిషికి 10 ఎలుకలు

*భారతదేశంలో ప్రతి మనిషికి సరాసరి 10 ఎలుకలు ఉన్నాయి ఒక జత ఎలుకల్ని మనం వదిలాం అనుకోండి అవి సంవత్సరానికి 800 - 1200 వరకు ఎలుకల్ని అధికం చేస్తాయి విపరీతంగా తినే అలవాటు ఎలుకలకుంది. ఆకారణంగా మనం సాలీనా 500 కోట్ల రూపాయలను నష్టపోతున్నాము.*

"ఏమీ లేకుండా పొందే వస్తువులకు ఒక్కొక్కసారి అధికంగా చెల్లించవలసి వస్తుంది."
—ఆల్బర్ట్ ఐన్‌స్టైన్

కణజాలాన్ని కావలసిన మేరకు తీసి కంటిపాపను తీర్చి దిద్దడానికి లేజర్ ఉపయోగపడుతున్నది. 1/2 మిల్లీ మీటరు మందమున్న కంటి ముందున్న భాగం నుండి గరిష్ఠ పక్షం 40/1000 మిల్లీ మీటర్ల కణజాలాన్ని లేజర్ ద్వారా తీయగలరు.

లేజర్ చికిత్స కోసం రోగులు సుమారు 20 నిమిషాల ముందు క్లినిక్‌కు వస్తారు. అప్పుడు వారికి లోకల్ అనేస్తీషియానిచ్చి (ఏదైనా ఒక భాగాన్ని సూదిచ్చి తిమ్మి రెక్కించడం) కంటి మందు కంట్లో వేస్తారు ఆ తరువాత 12 - 20 సెకండ్ల లోపుగా ఈ చికిత్స పూర్తవుతుంది. చికిత్స తరువాత కంట్లో ఏదో నలుసు వున్నట్లు కొంత బాధ కలుగుతుంది. ఈ బాధ పల్లును బలవంతంగా లాగేసినప్పుడు కలిగే బాధకంటే తక్కువ గానే ఉంటుంది.

ఒక కంటికి వెయ్యి పౌండ్ల చొప్పున ఈ చికిత్సకు ఖర్చు అవుతుంది. తుల నాత్మకంగా పరిశీలిస్తే దీని లాభం మీకే తెలుస్తుంది. సాధారణంగా కంటి అద్దాలకు నూరు పౌండ్లు ఖర్చు చేయాల్సి ఉంటుంది. అదే మోస్తరు కాంటాక్ట్ లెన్స్ కావాలంటే సంవత్సరానికి 300 పౌండ్లు ఖర్చు చేయాల్సి ఉంటుంది. ఈ చికిత్స ఒకసారి పొందితే జీవితాంతం ఇక పొంద వలసిన అవసరం ఉండదు. కాకపోతే 45 సంవత్సరాలకు పైబడినవారు చదివేందుకు కంటి అద్దాలు వాడవలసి ఉంటుంది.

— "ది ట్రిబ్యూన్" సౌజన్యంతో

## పొగత్రాగనివారు పొందే లాభాలు



*అతిగా పొగత్రాగేవారు పొగత్రాగనివారికంటే ఐదింతలు ఎక్కువగా హృద్రోగానికి గురి అవుతారు.*

*పొగత్రాగనివారు పొగత్రాగే వారికంటే పదింతలు తక్కువగా ఊపిరితిత్తుల కాన్సరుకు గురి అవుతారు.*

*మనిషిని పిప్పిచేసే ఊపిరితిత్తి వ్యాధులకు, దీర్ఘకాలిక శ్వాసనాళవువాపు ఎమ్ఫీసేమా లాంటి వ్యాధులకు పొగత్రాగేవారు పొగత్రాగని వారికంటే 5 మొదలు 10 ఇంతల వరకు ఎక్కువగా గురి అయ్యే అవకాశాలు ఉన్నాయి.*

*పొగత్రాగని వ్యక్తి ఎక్కువకాలం జీవించే అవకాశాలు ఉన్నాయి. అతను నెలకు రూ. 700 మొదలు రూ. 1500 వరకు పొదుపు చేయగలుగుతున్నాడు.*

— 'నేషనల్ హార్ట్ ఫౌండేషన్ ఆఫ్ ఆస్ట్రేలియా మరియు హార్ట్‌హెల్త్ మాన్యువల్' సౌజన్యంతో

"జ్ఞానం బరువు నివ్వవచ్చు. కానీ బుద్ధి నైపుణ్యం కాంతినిస్తుంది. చాలామంది ప్రజలు తూకం వెయ్యకుండానే చూసి గ్రహిస్తారు."

# వార్తలు

## అల్యూమినియమ్ ఎగుమతులలో ఐదవస్థానం




ఒరిస్సాలోని ది నేషనల్ అల్యూమినియమ్ కంపెనీ లిమిటెడ్ (Nalco) వారు అంతర్జాతీయ అల్యూమినియమ్ ఎగుమతి దారులలో ప్రస్తుతం ఐదవస్థానంలో ఉన్నారు.

## సగటున సంవత్సరానికి 5.9 సార్లు సినిమాలను చూస్తున్న భారతీయులు

సినిమాలను చూస్తున్న పది ప్రముఖ దేశాలు - రష్యా, సింగపూరు, హాంగ్‌కాంగ్, బల్గేరియా, ఐస్‌లాండ్, ఉత్తర కొరియా, రొమానియా, ఇండియా, వియత్నాం మరియు హంగేరీ. భారతదేశంలోని ప్రతి వ్యక్తి సగటున సంవత్సరానికి 5.9 సార్లు సినిమాలను చూస్తున్నాడు. •

## అత్యధికంగా పేపరును వాడుతున్న దేశం

పేపరును, పేపరు బోర్డును అత్యధికంగ వాడుతున్న దేశం అమెరికా సంయుక్త రాష్ట్రాలు. ఈ దేశం జనాభా ఇంచుమించు 250 మిలియన్లు. ఈ దేశంలోని ప్రతి వ్యక్తి సంవత్సరానికి సుమారు 311 కి.గ్రా.ల కాగితాన్ని వాడుతున్నాడు. ఇదొక ప్రపంచ రికార్డు.

## 85 శాతం పిల్లల జననం ఆసుపత్రులలో జరగడం లేదు

85 శాతం పిల్లల జననం మన దేశంలో ఆసుపత్రులలో జరగడం లేదు.

## 65 మిలియన్ ఇండ్లు మట్టి కట్టడాలు

మనదేశంలో సుమారు 118 మిలియన్ల ఇండ్లు ఉన్నాయి. ఇందులో 65 మిలియన్లకు మించిన ఇండ్లు మట్టితో కట్టబడి ఉన్నాయి.

## అతి ఎత్తైన హోటల్

*సింగపూర్‌లోని 73 అంతస్తుల వెస్టిన్ స్టామ్‌ఫోర్డ్ హోటల్ ప్రపంచంలో అతి ఎత్తైన హోటల్‌గా పరిగణింపబడుతున్నది. దీని ఎత్తు 226.1 మీటర్లు. జార్జియా (అమెరికా) లోని అట్లాంటాకు చెందిన 70 అంతస్తుల వెస్టిన్ పీచ్‌ట్రీ హోటల్ రెండవ స్థానంలో ఉంది. ఈ హోటల్ ఎత్తు 220 3 మీటర్లు.*

"నిజాయితీని మించిన వంశపారంపర్య ఆస్తి మరొకటి లేదు."

## 2000 సంవత్సరంలో 41 మిలియన్ల ఇండ్ల కొరత

2000 సంవత్సరంలో ఇండ్ల గిరాకీ బాగా పెరగబోతున్నది. మనకు 209.2 మిలియన్ల ఇండ్ల అవసరం ఉంటుంది కానీ నివాసయోగ్యమైన ఇండ్లు మనకు 168.2 మిలియన్లు మాత్రం ఉంటాయి ఆవిధంగా 41 మిలియన్ల ఇండ్ల కొరత ఏర్పడబోతున్నది.

## దక్షిణ ఆఫ్రికాలో బొగ్గుద్వారా విద్యుత్తు




దక్షిణ ఆఫ్రికా ప్రజలకు కావలసిన 80 శాతం విద్యుత్తు సరఫరా బొగ్గు ద్వారా జరుగుతున్నది. బొగ్గు ఎగుమతి చేస్తున్న దేశాలలో ఆఫ్రికాకు మూడవస్థానం లభిస్తుంది బొగ్గు నిలువల దృష్ట్యా ఈ దేశానికి ప్రపంచం మొత్తంలో నాలుగవ స్థానం లభిస్తుంది.

## చైనాలోని 70 శాతం పాఠశాలలు గ్రామప్రాంతంలో ఉన్నాయి

ప్రతి మూడు కుటుంబాలకు చైనాలో ఒక శిశువు ప్రాథమిక లేక జూనియర్ ఉన్నత పాఠశాలలో చదువుతోంది సుమారు 70 శాతం పాఠశాలలు గ్రామ ప్రాంతంలోనే నెలకొల్పబడి ఉన్నాయి.

—యునెస్కో సోర్స్

## ప్లాస్టిక్స్‌ల ఎగుమతిలో రెండవ స్థానంలో ఉన్న చైనా

జర్మనీ తరువాత ఈనాడు ప్రపంచం మొత్తంలో ప్లాస్టిక్స్‌ను ఎక్కువగా ఎగుమతి చేస్తున్న దేశం చైనా సంవత్సరానికి మిలియన్ టన్నలకు మించిన ఎగుమతి చేస్తున్న చైనా ప్రస్తుతం ద్వితీయ స్థానంలో ఉంది.

## భారతదేశపు అతి ప్రాచీన పౌరసభ

మద్రాసు కార్పొరేషన్‌ను భారతదేశపు అతి ప్రాచీన పౌరసభగా మనం పరిగణించ వచ్చును. ఈ పౌరసభకు అంకురార్పణం

## పండ్ల ఉత్పత్తిలో మనదేశం వాటా

పండ్లు తత్సంబంధమైన వస్తువుల గిరా యావత్ ప్రపంచంలో 16 బిలియన్ డాలర్ల మేరకు ఉంది అంటే ఇది ప్రపంచపండ్ల ఉత్పత్తిలో 8 శాతం అన్నమాట. ఇందులో భారత దేశం వాటా 0.41 శాతం మాత్రమే

"మనలో ఉన్నదాన్ని ఇతరులలో కూడా మనం చూస్తాము. మన చుట్టూ ఎప్పుడూ బురదనే చూస్తే, మనలో కూడా ఎక్కడో బురద ఉందని అది ఋజువు చేస్తుంది."

— ది మదర్

క్రీ.శ. 1688, సెప్టెంబరు నెలలో బ్రిటిష్ రాయల్ చార్టర్ (అధికారపత్రం) ఆధారంగా జరిగింది.

## ఖతార్‌లోని పరదేశీయులు

ఖతార్ దేశం జనాభా 2,50,000 అయితే ఇందులోని 70,000 మంది మాత్రమే ఆ దేశానికి చెందిన పౌరులు. మిగతా వారంత వలన వచ్చినవారే. వీరు ముఖ్యంగా భారతదేశం మరియు ఇతర అరబ్ దేశాల నుండి వలసవచ్చినవారే.

## భారతదేశంలో మధుమేహం

ప్రస్తుతపు లెక్కల ప్రకారం ఈ రోజు భారతదేశంలో 10 మిలియన్ ప్రజలు చక్కెర వ్యాధితో బాధపడుతున్నారు.

## ఒక పెట్టెకు 2 కేజీల వార్తా పత్రికలు

మన దేశంలోని హిమాచల్ ప్రదేశ్ ఆపిల్ పండ్లకు ప్రసిద్ధి చెందిన రాష్ట్రం. పండిన పండ్లను చెక్కపెట్టెలలో పదిలంగా పెట్టేందుకు సుమారు 9 కోట్ల రూపాయల విలువగల వార్తాపత్రికలను వాడుతున్నారు. ప్రతి పెట్టెలో పండ్లను అమర్చేందుకు 2 కే.జి.ల పేపరు కావల్సి వస్తుంది.

## కొత్తరకం వరి

కటక్ (ఒరిస్సా) లోని కేంద్రీయ బియ్యం పరిశోధనా సంస్థ (Central Rice Research Institute) వారు ఒక కొత్త రకం వరిని కనుగొన్నారు. ఈ రకం వరి కరువు కాటకాలను తట్టుకోగలదు. 60 రోజుల తరువాత పంట చేతికి రాగలదు.

## ఒక హెక్టేరుకు అత్యధిక 'టీ' దిగుబడి




టీ పంటకు, వినియోగానికి, ఎగుమతి మన దేశం ప్రపంచంలోకెల్లా ప్రథమస్థానంలో ఉన్నది. ఒక హెక్టేరుకు ఇంత దిగుబడి రికార్డు మనదేశంలో తప్ప ప్రపంచంలో మరెక్కడా లేదు.

## 90 శాతం పేద గ్రామీణులు నివసిస్తున్న 10 ప్రధాన రాష్ట్రాలు

మనదేశం జనాభాలోని 90 శాతం పేద గ్రామీణులు 10 ప్రధాన రాష్ట్రాలలో నివసిస్తున్నారు. ఆరాష్ట్రాల పేర్లు ఈ దిగువ ఇవ్వబడ్డాయి: ఆంధ్రప్రదేశ్, బీహార్, కర్ణాటక, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్, తమిళనాడు, ఉత్తరప్రదేశ్ మరియు పశ్చిమ బెంగాల్.

"క్రీడ కోసం అడవి జంతువులు ఎన్నడూ చంపవు. మానవుడు ఒక్కడే తన ఆనందం కోసం తన తోటి జీవులను హింసించి చంపివేయటం చేస్తాడు."

— జె.ఎ. ఫ్రౌడీ

# వివేకాన్ని పెంచుకో!

ప్రొ॥ సి.పి. రామన్ మీనన్

అన్నదమ్ముల మధ్య జరుగనున్న ఘోర మారణ సంగ్రామాన్ని ఆపుచేయాలన్న తలంపుతో శ్రీకృష్ణుడు రాయబారానికి మనఃస్ఫూర్తిగా అంగీకరించాడు. సంధి కుదర్చడానికి ఆఖరి ప్రయత్నాన్ని కృష్ణుడు చేయదలచుకున్నాడు. రాయబారానికి ఒప్పుకున్న కృష్ణునికి తన ప్రయత్నం వృధా ప్రయాస కాగలదు అన్న సంగతి తెలుసు.



కృష్ణుడు పాండవ పక్షపాతి అన్న సందేహం దుర్యోధనుడికి ఎప్పుడూ ఉండేది. పాండవుల పట్ల తనకున్న ఈర్ష్యనూ కృష్ణుని పట్ల తనకున్న అనాదర భావాన్ని వ్యక్తం చేసేందుకు, ఏవిధమైన స్వాగతం ఏర్పాట్లు చేయకూడదని ఆజ్ఞ జారీ చేసాడు. స్వాగత తోరణాలు కానీ, వీధుల అలంకరణ గాని లేవు పుర పౌరులను నగరానికి బయట నిలబడి కృష్ణుడిని చూడడానికి కూడా అనుమతించలేదు. కృష్ణభక్తుడైన విదురుడు తన ఆరాధ్య దైవానికి స్వాగత మివ్వడానికి ఊరు వెలుపల చేతులు కట్టుకుని నిల బడ్డాడు. వేయికండ్లతో కృష్ణుని రాకకు ఎదురు చూడసాగాడు.

కృష్ణుడి రథాన్ని చూచిన విదురుడు వడివడిగా ముందుకు నడిచాడు. రథం దిగిన కృష్ణుడికి విదురుడు భక్తిశ్రద్ధలతో సాష్టాంగ నమస్కారం చేసి, "ఓ సమస్త లోకాల ప్రభువా! హస్తినాపురంలో నున్న నా గృహానికి దయచేసి ఇప్పటికి చాలా కాలం అయింది. ఓ దయానిధి నా ఇంటికి విచ్చేసి నన్నూ నా గృహాన్ని పవిత్రం చేయండి" అని ప్రార్థించాడు. సర్వం తెలిసిన జగన్నాథుడు విదురుడి ఆహ్వానాన్ని స్వీకరించాడు.

## సిద్ధుడు అనగా సాధించినవాడు!

యోగసాధన ద్వారా ఔషధాల- రంగంలో ఫలితాల్ని సాధించినవారిని సిద్ధులంటారు. వీరు ఒక రకంగా ఋషులవంటివారు. సిద్ధుడు అన్నమాటకు అర్థం సాధించినవాడు అని. సిద్ధుల ఔషధాలకు సంబంధించిన సాహిత్యం తమిళభాషలో లభ్యమవుతున్నది అందుకే దక్షిణ భారతదేశానికి చెందిన తమిళ భాషీయులు ఈ వైద్యాన్ని రోగ నివారణకు బాగా వాడుతున్నారు.

"ప్రతీకారం ద్వారా పగ నిర్మూలనం కాదు." — రాజాజీ

ఇల్లు చేరిన తరువాత ఉచితాసనాన్ని ఇచ్చి సేద తీర్చుకోమన్నాడు. ఆ తరువాత చాలా ఏళ్ళ క్రితపు అలవాటు ప్రకారం అరటి పండ్లను స్వీకరించమన్నాడు. బాల కృష్ణుడికి ఇలా తినిపించిన రోజులు విదురుడికి గుర్తొచ్చాయి. తొక్క వొలిచి కండను పరవశంతో విదురుడు ఇచ్చాడు. కృష్ణుడు కండని తృప్తిగా ఆరగించాడు.



కాస్సేపయిన తరువాత కృష్ణుడు విదురుడితో "విదురా! మనం తక్షణం దుర్యోధనుడి దర్బారుకు బయలుదేరాలి. మనం ఆలస్యం చేసామంటే దుర్యోధనుడు అన్యధా భావించగలడు" అన్నాడు. కృష్ణుడి పాదాల దగ్గర కూర్చున్న విదురుడు లేచి నిలబడ్డాడు అప్పుడు అతని దృష్టి పళ్ళెంపై పడ్డది. పళ్ళెంలో తొక్కకు బదులు కండ ఉండటం విదురుడు గమనించాడు. అతని గుండె వేగంగా కొట్టుకోసాగింది. తాను తోలు ఇవ్వగా కండను వదలి కృష్ణుడు తోలును మాత్రం తిన్నాడని విదురుడికి తెలిసిపోయింది.

విదురుడి కంటి నుండి జలజలా నీరు కారింది. అతడి గొంతు బొంగురు పోయింది. భావావేశానికి లోనై విదురుడు తన అజాగ్రత్త వల్ల కృష్ణునికి అమర్యాద జరిగినందుకు తనను క్షమించమని ప్రార్థించాడు. భక్తుల మెదడులో చెలరేగే ఆలోచనలను సహితం చూడగల జ్ఞాని అయిన కృష్ణుడు విదురుడితో "వివేక సంపన్నుడవై ఓ విదురా! నీవు నన్ను క్షమించమని కోరుతున్నావు. ఈ కోరికకు అర్థం నాకు ఒకలా స్ఫురిస్తోంది. నా దృష్టిలో నీవు పరిపూర్ణ వివేకాన్ని ఇంకా పొందలేదు. నన్ను భౌతిక రూపంలో దర్శించిన నువ్వు తన్మయుడవైనావన్న సంగతి నాకు బాగా అర్థమైంది. ఆ కారణంగా నీ కంటికి నేను తప్ప పరిసరాలలో ఉన్న ఏ వస్తువు కనబడలేదు. అందుకే కండను పళ్ళెంలో వేసి తొక్కను మాత్రం నాకిచ్చావు. ఇది చాలా సాధారణంగా పరవశత్వం కారణంగా, జరుగుతూ ఉంటుంది. ఇక మరో విషయమేమంటే నన్ను నీవు సరిగ్గా అర్థం చేసుకోవటంలో సఫలం కాలేక పోయావు. నావరకు తొక్కకు, కండకు వ్యత్యాసం అసలు లేదు. నా భక్తులు ప్రీతితో ఏమిచ్చినా నేను సంతోషంగా గ్రహిస్తాను. నాకు కావలసింది ఈ భక్తే. ఈ బహుమతి నాకు ప్రియకరమైనది. నేను దీన్నే స్వీకరిస్తాను. నీవు గొప్ప జ్ఞానివే. అయినా ఎందుకో ఈ విషయంలో నీవు నీ వివేకాన్ని కోల్పోయావు. ఈ ప్రపంచంలో ఎవరూ సంపూర్ణ వివేకాన్ని పొందలేరు. ఓ విదురా! నీవు వివేకాన్ని పెంచుకో" అని అన్నాడు.

"మనం నిజంగా ఏదైనా చేయదలచుకున్నప్పుడు, అది చేసేందుకు సంతృప్తికరమైన కారణం వెదకటానికి మనకు ఎక్కువ ఇబ్బంది కలగదు."

# వీరిని గురించి తెలుసుకోండి

అమ్రిత్ లాల్ విఠల్‌దాస్ థక్కర్ (థక్కర్ బాబా) (1869-1951): వృత్తి చేత ఇంజనీయర్ అయిన థక్కర్ బాబా పోను పోను సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీతో సంబంధం ఏర్పరచుకున్నారు. ఆదిమవాసుల సంక్షేమానికి అంటరానితనాన్ని పార ద్రోలేందుకూ ఈయన బాగా శ్రమించారు. ఈ ఉద్యమాలలో వారు ప్రధాన పాత్రను వహించారు. జెమ్‌షెడ్‌పూర్‌లో ఉంటూ కార్మికుల సంక్షేమ కార్యక్రమాల్ని చేబట్టారు.




రమణ మహర్షి (1878-1950): తమిళ నాడు రాష్ట్రంలోని మధురై జిల్లాకు చెందిన ఒక గ్రామంలో వీరు జన్మించారు. ఆ తరువాత ఇల్లు వాకిలి వదలి వీరు తిరువణ్ణామలైలో స్థిరపడిపోయారు. అక్కడ వీరికి దివ్యజ్ఞానం కలిగింది. వీరు మానవాళికి ఆధ్యాత్మిక గురువులుగా భక్తులచే పరిగణింపబడుతున్నారు. సత్య శాంతులను వెదుక్కుంటూ వచ్చిన భక్తులతో వీరు తరచుగా చిన్న వ్యాఖ్యలతో, పిట్టకథలతో సంభాషించేవారు.

సిస్టర్ నివేదిత (1867-1911): ఈమె 1867లో ఐర్లాండ్ దేశంలో జన్మించింది. మార్గరెట్ ఎలిజబెత్ నోబెల్ అన్న పేరుతో ఈమె నామకరణం జరిగింది. ఈమె స్వామి వివేకానందులు వారి పట్ల ప్రగాఢ భక్తిశ్రద్ధలున్న శిష్యురాలుగా మారింది. 1898వ సంవత్సరంలో ఈమె భారతదేశంలో అడుగుపెట్టింది. అప్పటి నుండి ఇక్కడి ప్రజల అభిలాషలను, భావావేశాలను తనవిగా భావించింది.

# అవార్డులు

## పాండే గారికి "శంకర్" బహుమతి

*'భారతీయ పరంపరా కే మూల్‌స్వర్' అన్న గ్రంథానికి గాను సుప్రసిద్ధ హిందీ సాహిత్యకారుడు శ్రీ గోవింద చంద్రపాండేకు 1992 వ సంవత్సరపు "శంకర్ అవార్డు" లభించింది.*

## డా. ఏకాంబరం గారికి గాంధీ బహుమతి

కుష్ఠు నివారణకు అహర్నిశం పాటుబడుతున్న *డా. వి. ఏకాంబరం గారికి 1994* వ సంవత్సరపు *అంతర్జాతీయ గాంధీ బహుమతి ఇవ్వబడింది. వీరు మద్రాసు వాస్తవ్యులు.*

"ప్రారంభంలో వస్తువులన్నీ (విషయాలన్నీ) ఉత్తమంగానే ఉంటాయి."
— లార్డ్ ఛెస్టర్‌ఫీల్డ్

ఈమె ఆదర్శాలు జాతీయ భావాలున్న అప్పటి యువకులను ప్రభావితం చేసాయి.

నాన్సీ విట్‌చర్ ఆస్టర్ (1879-1964): అమెరికాలో జన్మించిన ఈమె 1919లో బ్రిటిష్ పార్లమెంట్‌కు కన్సర్‌వేటివ్ (సంప్రదాయవాదుల) పార్టీ సభ్యురాలుగా ఎన్నికైంది. ఆవిధంగా ఎన్నుకోబడిన ఏకైక వనితగా ఆమె పేరు ప్రతిష్ఠలను పొందింది. ఈమె స్త్రీల హక్కుల కోసం పోరాడారు నిరుపేదలకు సహాయం చేయడానికి చాలా పాటుపడ్డారు.

పెర్సీ బెషీ షెల్లీ (1792-1822): బ్రిటన్‌కు చెందిన ప్రముఖ భావకవులలో వీరొకరు. ఆయన "టు ఎ స్కైలార్క్" మరియు "ఓడ్ టు ది వెస్ట్ విండ్" రచనల ద్వారా ఈ రోజుకూ అందరికీ గుర్తున్నారు. అతడు దేవుడిని నిరాకరించాడు. అతని రాజకీయ సాంఘిక ఆదర్శాలు ఆ రోజుల్లో అతనిని విప్లవవాదిగా చేసాయి.

అశుతోష్ ముఖోపాధ్యాయ (1864-1924): వీరు అప్పట్లో ఒక ప్రముఖ న్యాయవాది. ఆ తరువాత వీరు కలకత్తా హైకోర్టు జడ్జిగా పనిచేసారు. వీరు 10 సంవత్సరాల కాలం కలకత్తా విశ్వవిద్యాలయ ఉపకులపతి (వైస్ ఛాన్స్‌లర్)గా కూడా పనిచేసారు అప్పటి పండితజ్ఞులైన ఆచార్యుల సహాయ సహకారాలతో అధ్యాపనంతో కూడిన పరిశోధనా విశ్వవిద్యాలయానికి పునాది వేసారు.

# స్టాంపుల కథ

## కొత్త సంవత్సరపు శుభ శకునాలు




*నియన్‌హ్వా (Nienhwa) అన్న వర్ణ చిత్రాన్ని చాంద్రమాన కొత్త సంవత్సరం, అంటే మన ఉగాది పర్వదినాన గీయటం చైనీయుల అలవాటు. ఇది వారి సాంప్రదాయిక కళ. రాబోయే కొత్త సంవత్సరం భోగభాగ్యాలను సమకూర్చే ఉగాది కావాలన్న తమ శుభాకాంక్షలను ఆ రెండర్థాల సంవత్సరం పేరు చెప్పి మరీ అందజేస్తారు. ఆ వర్ణ చిత్రం ద్వారా అందులో తెలుపబడిన వస్తువుల ప్రాశస్త్యం లేక దాని పరిణామాల్ని వారు తెలియజేస్తారు రాబోయే కొత్త చాంద్రమాన సంవత్సరం (ఉగాది) సందర్భంగా తైవాన్ (చైనా) నాలుగు జతల స్టాంపులను విడుదల చేసింది. ఇందులో నాలుగు నియన్‌హ్వాలు బాణ సంచాను తయారు చేస్తున్నట్లు వాటితో ఆడుకుంటున్నట్లు చిత్రీకరించబడి ఉంది.*

*—కవితా రాయ్*

"శాంతంగా ఉండండి. అప్పుడు ప్రతివారిని అదుపు చేయగల్గుతారు.'

# ప్రపంచ నగరాలు

## సిడ్నీ

న్యూ సౌత్ వేల్స్ రాష్ట్ర రాజధాని నగరం పేరు సిడ్నీ. ఆస్ట్రేలియా దేశానికి చెందిన అతి పురాతనమైన, అతి విశాలమైన నగరం ఇదే. ఈ నగరం ఆ దేశపు ఆగ్నేయ కోస్తా ప్రాంతంలో ఉంది. పరిసర ప్రాంతాలలో నివసిస్తున్న ప్రజలతో సహా ఈ నగరం జనాభా 3,656,500.



Sydney (Australia)

సిడ్నీ చక్కటి రేవున్న నగరం. ఈ నగరం రెండు అఖాతాల మధ్య వెలసిన నగరం ఈ నగరానికి దక్షిణాన జార్జస్ (Georges) నదీ ముఖానికి దగ్గరున్న బొటాని అఖాతం (Botany Bay) ఉత్తరాన పర్రామట్టా (Parramatta) నదీ ముఖానికి దగ్గరున్న జాక్సన్ రేవు అందాన్ని తెచ్చి పెడుతున్నాయి. హార్బరు దగ్గరున్న 500 మీటర్ల పొడవున్న గంభీరమైన వంతెన చూపరులను ఆకట్టుకుంటుంది. జాక్సన్ (Jackson) రేవు ఉత్తర దక్షిణ తీరాల్ని, ఈ వంతెన కలుపుతుంది.

సిడ్నీ నగరంలో ఒపెరా హౌస్ (నాటక, సంగీత ప్రదర్శనశాల) చాలా ప్రసిద్ధమైనది. ఈ ప్రదర్శనశాల నిర్మాణం 1950-60 ప్రాంతాలలో జరిగింది కోటలాంటి గవర్నర్ బంగళా తప్పక చూడవలసిన కట్టడం. ఇవికాక రెండు కాథడ్రల్స్ (క్రైస్తవుల పెద్ద గుడి) కూడా చూడదగ్గవే. ఈ నగరంలోని మ్యూజియములు, గ్రంధాలయాలు, కళా ప్రదర్శనశాలలు, రెండు విశ్వవిద్యాలయాలు మొదలైనవి తప్పక చూడవలసిన స్థలాలు.

రోజూ వాడే వస్తువులనూ, యంత్ర సామగ్రినీ, గుడ్డలనూ, వస్త్రాలనూ, ఆటోమొబైల్స్‌నూ తయారుచేసే భారీ కార్ఖానాలు ఈ నగరంలో ఎన్నో ఉన్నాయి. గోల్డెన్ బీచ్‌లు మైళ్ళ తరబడి ఈ నగరంలో ఉన్నాయి.

---

## కళింగ బహుమతి

*విజ్ఞాన శాస్త్రం బహుళ ప్రచారం కోసం కళింగ బహుమతిని ఏర్పాటు చేశారు ఒరిస్సా కళింగ ఫౌండేషన్ ట్రస్ట్ వారు 1951లో ఈ బహుమతిని నెలకొల్పారు. ఈ ట్రస్టు వ్యవహారాలను యునెస్కో వారు నిర్వహిస్తారు.*

"మానవత్వానికి సర్వోన్నత ఆదర్శం - విశ్వమానవ సౌభ్రాతృత్వం, ఈ ఆదర్శం దిశగా ప్రపంచం నెమ్మదిగా, కచ్చితంగా సాగిపోతున్నది."

# ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోవడం ఎలా

డా. క్లైవ్ డి. హర్లీ

మన శక్తి సామర్థ్యాలపట్ల తరుచుగా మనకే నమ్మకం ఉండదు. మనం పనిని చేయగలమా అన్న విశ్వాసం వారికుండదు. ఇతరులకు మనం నచ్చుతామా లేదా అన్న సంశయం వారిని పట్టి పీడిసూ ఉంటుంది



వారిని న్యూనతాభావం వెంటాడుతూ ఉంటుంది. మా అవసరం ఎవరికీ లేదు అని కూడా వారు భావిస్తూ ఉంటారు. కానీ మనం కోల్పోయిన విశ్వాసాన్ని తిరిగి పొందగలమని మాత్రం మరచిపోకూడదు. అందుకు తారకమంత్రం లాంటి మూడు సూత్రాలను స్మరించుకుంటూ ఉండండి.

1. మీపై మీకు నమ్మకం లేకపోవడానికి, మీ శక్తి మీకు గుర్తుకు రాకపోవడానికి కారణం చాలావరకు చిన్న వయసులో జరిగిన ఏదైనా ఒక సంఘటన అయి ఉంటుంది. ఆ వయసులో ఇతరులతో మిమ్మల్ని మీరు పోల్చుకుని ఉంటారు. ఆ కారణాన్ని వెనక్కుపోయి మీరు తెలుసుకో గలిగితే, కోల్పోయిన నమ్మకాన్ని తిరిగి పొందవచ్చును. మీరు కారణాన్ని తెలుసుకో లేకపోయారనుకోండి అప్పుడు ఆ సంగతిని మరచిపోయి రెండో సూత్రానికి రండి.

2. మీరు సాటిలేని మేటి వారు ప్రపంచంలోని ఏ ఇద్దరి వేలుముద్రలూ ఒకేలా ఉండవన్న సంగతి మీరు విని ఉంటారు. ఇది ఒక వేలుముద్రలకే పరిమితం కాదు. ఇతర విషయాలకు కూడా వర్తిస్తుంది. మీలాంటివారు, ఈ ప్రపంచంలో మీరే. మీతో సమానమైనవారు లేరు. ఇక ముందు కూడా ఉండరు. అంటే మీలా పనులు చేయగలవారు, మీలా

---

## ఉద్వేగ పూరిత క్రమశిక్షణా రాహిత్యం

*"మనం క్రమశిక్షణా రాహిత్యాన్ని గురించి మాట్లాడుతాము. కాని క్రమశిక్షణా రాహిత్యంలో అతి భయంకరమైనది. ఉద్వేగపూరిత క్రమశిక్షణా రాహిత్యం అన్న విషయాన్ని మరచిపోతాము. వ్యక్తి మానసిక సమస్థితిపై ఈ ఉద్వేగ పూరిత క్రమశిక్షణా రాహిత్యం దాడి చేస్తుంది."*

— జవహర్‌లాల్ నెహ్రూ

"ఎవరైనా తనకు తానుగానూ, తన వృత్తిలోనూ సాహచర్యం నెరవుకోవచ్చు, అప్పుడు అతని వయస్సు ఎంతైనప్పటికీ - వృద్ధాప్యం వచ్చిందనే భావం రాదు."

తోడ్పడేవారు ఈ భూప్రపంచంలో మరొకరు లేరన్నమాట

3 ప్రజలకు మీ అవసరం ఉంది మన అవసరం ఎవరికో ఒకరికి తప్పక ఉంటుంది. ఉదాహరణకు మన అవసరం మన కుటుంబానికుంది, మన మిత్రులకు మన పరిచయస్థులకూ ఉంది. ఈ భావనను పునాదిగా చేసుకుని నమ్మకాన్ని మనం పెంచుకోవచ్చును మన నమ్మకానికి ఆధారం అప్పుడు కల్పన కానే కాదు. దానికి ఆధారం ఒక అచంచల యదార్థం అని మనకు ఇట్టే తెలిసిపోతుంది



ఇప్పుడు మీలో దాగిన శక్తిని మీరు గుర్తించగలరు. మొట్టమొదట మీ జీవితానికి ఒక లక్ష్యాన్ని ఎన్నుకోండి. ఆ లక్ష్యాన్ని చేర డానికి ఒక ప్రణాళికను తయారు చేసుకోండి. ఆ గమ్యం వైపు విజయవంతంగా సాగు తున్నట్లు మిమ్మల్ని మీరు చిత్రించుకోండి.

మీరు దేనికోసం జీవిస్తున్నారు? అది మీ పనిలోని అంతర్భాగం కావచ్చు. అది మీ ఇల్లు కావచ్చు లేదా ఒక మంచి పనికి చేయూతనిచ్చి పూర్తి చేయడం కావచ్చు. అది ఏమైనా పరవాలేదు. మీ శక్తిని కూడగట్టుకుని, మీ దృష్టిని ఆవైపు కేంద్రీకృతం చేసుకోండి. మీ లక్ష్యాన్ని మీ ముందు సర్వకాల సర్వావస్థల యందు ఉంచుకోండి. సాధారణ భావాలతో ఎప్పుడూ తృప్తి పడకండి. ప్రతి రోజూ ఏమి చేయాలో ఆలోచించుకుని ఆ ప్రకారం ఒక ప్రణాళికను వేసుకోండి. నిద్ర లేచారను కోండి. అప్పుడు మీ ముందు ఒక క్రొత్త రోజు ఉంటుందన్న మాట. ఆ రోజున మీరు మీ గమ్యానికి చేరువగా వెళ్ళడానికి ఆస్కారం ఉందని నమ్మండి. ఆ పరిస్థితిలో మీరు ఆ రోజు ఎలా ఉపయోగించగలరో కాస్తంత ఆలోచించండి.

మీ ముందున్న రోజును ఒకసారి సమీ క్షించుకోండి. ఆ రోజు ప్రారంభమయే ముందే మీ మనసులోనే ఆ రోజును అనుభవించండి. అప్పుడు ఆ రోజులోని

## రాయల్ గ్రీన్‌విచ్ నక్షత్రావలోకనశాల

*ది రాయల్ గ్రీన్‌విచ్ నక్షత్రావలోకనశాల స్థాపన 1675 లో జరిగింది. లండన్‌లోని గ్రీన్‌విచ్ ప్రాంతంలో ఉన్న ఈ అవలోకనశాలలో అతి ప్రశస్త్యమైన దృష్టికి సంబంధించిన దూరదర్శనులున్నాయి. ఈ ఉపకరణాల కారణంగా ఖగోళ ప్రపంచంలో ఈనాటికి బ్రిటిష్ వారు తమ విశిష్ట స్థానాన్ని నిలబెట్టుకోగలుగుతున్నారు.*

— బ్రిటిష్ ఇన్‌ఫర్‌మేషన్ సర్వీసెస్

"నీ హృదయంలో ప్రేమ నింపుకుని కార్యనిర్వహణకు వెళ్ళు. ఆ నీవు తేలికైన మనసుతో, సంతోషంతో చేయగలుగుతావు."

ప్రతి భాగాన్ని
ఎదిరించగలరు పడుకునే ముందు మీరు గడిపిన రోజును గురించి ఒకసారి ఆలోచించండి. మీరు సాధించవలసినదాన్ని నమ్మకంతో తప్పక సాధించగలరు.

దృఢ నిశ్చయమున్న ఒక అమ్మాయి విషయం నాకు తెలుసు. తన జీవితాన్ని ఎలా మలచుకోవాలో తన గమ్యమేమిటో ఆమెకు చాలా బాగా తెలుసు. మొదట్లో ఆమె గడుపుతున్న జీవితం ఆమె లక్ష్యాలకు, ఆమె తెలివితేటలకు, ఆమె అవకాశాలకు అనుగుణంగా ఉండేదికాదు. కాని ఆమె నిరాశ చెందలేదు. ధైర్యాన్ని అసలు కోల్పోలేదు. నిర్ణయాన్ని మార్చుకోకుండా తన మార్గంలో వచ్చిన అడ్డంకులను, కష్టాలను అధిగమిస్తూ వచ్చింది. తుదకు ఆమె అనుకున్న దాన్ని సాధించగలిగింది. మీరు విసుగు చెందకుండా కృతనిశ్చయంతో ప్రయత్నిస్తే సాధించలేనిదంటూ ఏదీ లేదు.

డా. నార్మన్ విన్సెంట్ పీలేతో సంప్రదించేందుకు ఒకసారి నిరాశతో కూడిన ఒక వ్యక్తి వచ్చాడు. ఆ వ్యక్తిలో ఆత్మవిశ్వాసాన్ని జాగృతం చేయాలన్న సంకల్పంతో అతనికి "దేవుడి బలంతో నేను అన్ని పనులను చేయగలను" అన్న తారక మంత్రాన్ని ఉపదేశించారు. ఆ మంత్రాన్ని మరీమరీ జపించమన్న ఆదేశం అతనికి ఇవ్వబడింది. ఆ తరువాత అతనిలో కొత్త విశ్వాసం చిగురించింది. దాంతో అతడు విజయవంతంగా అనుకున్న దాన్ని సాధించగలిగాడు.

ఈ పునాదులతో, ఒక ఉద్దేశంతో ఒక ప్రణాళికతో కొన్ని ఆచరణీయమైన అడుగులను వేద్దాం. మీ సమయం సంకెళ్ళను మీ చేతులలో ఉంచుకోండి. మీ ఇష్టానుసారం గడపగలిగిన మీ తీరిక సమయాన్ని మీ అదుపులో ఉంచుకోండి. మనలో చాలా మంది ఎక్కువ సమయాన్ని ఇట్లే వ్యర్థం చేస్తూ ఉంటారు. సమయాన్ని సరిగా ఉపయోగించుకోండి. ఉపయోగించబడని సమయం అసలు ఉండకూడదు. సేద

## టెలివిజన్‌లో ప్రదర్శించబడిన మొదటి సినిమా

*'మహల్' హిందీ చిత్రాన్ని మొట్టమొదటి సారిగా దూరదర్శన్ టెలివిజన్‌లో ప్రదర్శించింది. 1949 లో విడుదలయిన ఈ సినిమా దర్శకుడు కమాల్ ఆమ్రోహి ఈ సినిమాను మూడు భాగాలుగా వరుసగా మూడు శనివారాలు 1965 లో చూపించారు.*

"నువ్వు భగవంతుణ్ణి ప్రేమిస్తే చాలదు, భగవంతుడు నిన్ను ప్రేమించేటట్లు నడుచుకోవాలి." — బాబా

తీర్చుకునేందుకు కూడా సమయం కావల్సి వస్తుంది.

మాట్లాడే తరుణం ఇదే!

మీపట్ల మీకు నమ్మకం లేని ఒక రంగాన్ని ఎంచుకోండి ఆ రంగంలో ఎలాగైనా ప్రగతిని సాధించాలని దృఢనిశ్చయులు కండి. అది ఒక విషయంగా మీ అభిప్రాయాన్ని వ్యక్తపరచడమో లేదా చర్చలో పాల్గొనడమో ఏదైనా కానివ్వండి. చాలా సందర్భాలలో ఒక విధమైన ఆత్మన్యూనతాభావం మీలో జన్మించి ఉండవచ్చు. అలాంటి సందర్భాలను ఎదుర్కొనేందుకు సంసిద్ధులు కండి.

మీ సంభాషణలను బాగా గమనించండి. మీరు చేయవలసిన పనిని గురించి మాట్లాడుతున్నప్పుడు సంపూర్ణమైన ఆత్మ విశ్వాసంతో మాట్లాడండి మీరు విజయం సాధించగలరన్న నమ్మకం ఎదుటివారికి కలిగేలా మాట్లాడండి. మీ హద్దులను దాటి అయినా సరే జనాన్ని కలవండి. వారి సంభాషణలలో పాల్గొనండి. మీరు చెప్పదలచుకున్న మాటను చెప్పకుండా స్నేహితులను కలవకుండా రాకండి.

మీకు బిడియం ఎక్కువైతే, ఎవరో తన అభిప్రాయాన్ని తెలియజేస్తున్నట్లు భావించి చెప్పండి. ఏది ఏమైనా సరే మీరు అనుకున్నది మాత్రం తప్పక చెప్పండి.

ప్రతి రోజూ మీరు మీ నమ్మకాన్ని
ధృవీకరించుకోండి

నేను చేయగలను అన్న దృఢ విశ్వాసంతో మీ ప్రతి రోజును ప్రారంభించండి. ''ఈ రోజును నేను చేబట్టనున్నాను. నేను సాధించగలను. నాలో శాశ్వత శక్తి ఉంది'' అన్న నమ్మకంతో పనులను చేబట్టండి. ఈ మాటను మీరు ముస్తాబవుతున్నప్పుడూ,

## సంక్షిప్తంగా

### యాత్రాస్థలం కుశీనగరం


BUDDHA

*ఉత్తరప్రదేశ్‌కు చెందిన గోరఖ్‌పూర్ జిల్లాలోని కాసియా ఒకప్పటి కుశీ నగరం. ఈ కుశీ నగరంలో సాల్ వృక్షాల మధ్యలో తన 80వ ఏట గౌతమ బుద్ధుడు నిర్వాణం పొందాడు. అప్పట్లో ఇది అనేక బౌద్ధారామాలకు నిలయం. ఈ రోజు అశోక స్థూపం, ఆ తరువాత కట్ట బడిన కట్టడాలలో పూరుకుపోయి ఉంది. ఇంకా గంభీరంగా నిలబడి ఉన్న నిర్మాణం 'మాతా కున్వార్ కాకోట్' ఈ కట్టడంలో నిర్వాణ సమయంలో శయనించిన బుద్ధుడి అతి విశాల విగ్రహం ప్రతిష్ఠించబడి ఉంది. ఈ విగ్రహం ముక్కలు చెక్కులుగా కనుగొన బడింది. కార్లైల్ మహాశయుడికి ఈ ముక్కల్ని జాగ్రత్తగా చేర్చిన ఘనత దక్కుతుంది.*

"శాస్త్రాధ్యయనం చేసి భగవంతుణ్ణి వివరించడం, దేశ పటం చూసి

పని చేసేందుకు ఇల్లు వదలి వెళుతున్నప్పుడూ, మననం చేసుకుంటూ ఉండండి. ఈ పని ప్రతి ఉదయం చేయండి.

మధ్యాహ్నం వేళలో మరో సూక్తి వాక్యాన్ని ఎన్నుకోండి. మీరు చేస్తున్న పనిని అవు చేసేందుకు ఒక సమయాన్ని నిర్ణయించుకొని నింపాదిగా "నేను ఒంటరిగా లేను. అనంతమైన శక్తి నాలో ఉన్నది" అనిగాని లేదా "నేను ఒంటరిగా లేను నాలో భగవంతుడున్నాడని" అని గాని మీలో మీరు కనీసం మూడుసార్లు మననం చేసుకోండి. మీకు తీరిక దొరికిందనుకోండి. పై మాటలను మరీమరీ మీలో మీరు అనుకోండి.

మీరు పడుకోబోయే ముందు "నేను ఈ ప్రపంచానికి ఉపయోగపడే పనిని ఈ వేళ చేసాను. ఆ పని చేసేందుకు నాలో కావలసిన శక్తి నిలువ వున్నది. ఇప్పుడు నేను నిశ్చింతగా నిద్రపోగలను" అని మీతో మీరు మాట్లాడుకోండి.

ఖచ్చితమైన నమ్మకాల్ని మనలో పెంచుకోవడం వల్ల మనం సత్ఫలితాలను పొందవచ్చును. ఇలా చాలామంది విషయంలో జరిగింది. దీనిని మీ పద్ధతిగా చేసుకోండి.

ఆఖరుగా ఒక మాట. అపజయం కలిగినా ఖాతరు చేయకుండా మీరు ముందుకు సాగుతూ పొండి. అప్పుడప్పుడు "నేను చేస్తున్నది వృధా ప్రయాస అవుతుందేమో" నన్న సందేహం కూడా మిమ్మల్ని వెంటాడ గలదు. అప్పుడప్పుడు నమ్మకం సన్నగిల్లి మీలో నిరుత్సాహం అధికమయ్యే సందర్భం కూడా వచ్చేందుకు అవకాశముంది. అయినా నమ్మకాన్ని మాత్రం పోగొట్టుకోవద్దు. ఒక పోరు ఓడిపోయినంత మాత్రాన యుద్ధాన్ని ఓడిపోము. మీరు ముందుకు పోవాలనుకుని నిశ్చయించుకున్నప్పుడు ఓడిపోయే అవకాశమే లేదు.

పాత తప్పులను, అపజయాలను గురించి ఎప్పుడూ గుర్తు చేసుకోకండి. ముందుకు పోవడమన్నదే మీ గమ్యం. మీకు మీరే పోటి. మీరు ఇవ్వగలిగినదాన్నే మీరు మాత్రమే ఇవ్వగలరు. మీ ప్రణాళిక తప్పక విజయవంతం కాగలదు. అది విజయవంతం అయి తీరుతుంది.

## ప్రపంచంలో ప్రతి నిమిషానికి 15 మంది పిల్లలు చనిపోతున్నారు

*అన్నంలేని కారణంగానూ, మంచినీళ్ళ వసతి లేనందువల్లను, చౌకవైద్య సౌకర్యాలు దొరకని కారణంగా ప్రపంచ మొత్తంలో ఈ రోజు నిమిషానికి 15 మంది చొప్పున పిల్లలు చనిపోతున్నారు. ప్రతి నిమిషానికి ప్రపంచం లోని మిలటరీ ఆయుధాలకు గాను 2 మిలియన్ డాలర్లను బడ్జెట్ కబళిస్తోంది. కానీ అభివృద్ధి చెందుతున్న దేశాల మిలటరీ ఖర్చు 1960 మొదలు జీవన ప్రమాణం వేగం కంటే రెండింతలు పెరిగింది.*

*— ఎఫ్.ఎ.ఐ. రిపోర్టు*

# ఈ శతాబ్దంలో

## నూటికి నూరుపాళ్ళు విద్యుకరణను సాధించిన ఏకైక రాష్ట్రం

గ్రామాల విద్యుకరణ పథకాన్ని నూటికి నూరుపాళ్ళు అమలు పరిచిన ఏకైక రాష్ట్రం - హర్యానా. 1970 నవంబర్ 29వ తారీఖున మొత్తం గ్రామాల విద్యుకరణ పూర్తి అయింది. ఈ బృహత్ పథకాన్ని అమలు పరచిన ఏకైక రాష్ట్రం హర్యానా.

## సంతోష్‌ట్రాఫీను మొదటి సంవత్సరమే పొందిన బెంగాల్ జట్టు




జాతీయ కాలుబంతి పోటీ ఛాంపియన్ షిప్‌ను మనం సంతోష్‌ట్రాఫీ పేరుతో పిలుస్తున్నాము. సంతోష్ రాజ్యం మహారాజా పేరుతో ఈ ట్రాఫీను నెలకొల్పారు. మొట్టమొదటిసారిగా ఈ పోటీలు 1941లో నిర్వహింపబడ్డాయి. ఆ పోటీలో మొత్తం 14 జట్లు పాల్గొన్నాయి. విజయం బెంగాల్ జట్టుకు దక్కింది.

## యూరోపియన్ ఆర్థిక మండలి

1958 జనవరి ఒకటవ తారీఖున యూరోపియన్ ఆర్థిక మండలి (యూరోపియన్ ఎకనామిక్ కమ్యూనిటీ) స్థాపన జరిగింది. దీనికి ముందు రోమ్ ఒప్పందం (ట్రీటీ ఆఫ్ రోమ్) పై 1957, నవంబరు 25 వ తారీఖున సంతకాలు జరిగాయి. ఈ ఒప్పందంలో ఆరు దేశాల - ఫ్రాన్స్, ఇటలీ, (అప్పటి) పశ్చిమ జర్మని, బెల్జియం, హాలండ్ మరియు లుక్సమ్‌బర్గ్ — ప్రతినిధులు సంతకం చేశారు. 16 సంవత్సరాల తరువాత, అంటే 1973వ సంవత్సరం యునైటెడ్ కింగ్‌డమ్‌తో డెన్మార్క్ ఐర్లాండు కూడా ఈ మండలిలో చేరింది.1986లో స్పెయిన్ పోర్చుగల్ దేశాలు ఈ మండలిలో సభ్యులుగా చేరాయి.

---

## రైతు జీవితంపై మొదటి హిందీ సినిమా

*ఈ శతాబ్దపు 3 వ దశకం చివరిపాదంలో దర్శకుడు మహబూబ్ తీసిన సినిమా 'ఔరత్' విడుదలైంది రైతు వాస్తవిక జీవితాన్ని సహజంగా చిత్రీకరించిన మొదటి హిందీ సినిమా ఇదే ఈ చిత్రం ఆ రోజుల్లో బాగ విజయవంతమైంది.*

"ధరాతుడైన మనిషి ఒక మంచి గంధపు చెట్టు లాంటి వాడు దానిని

## స్ట్రేలియా దేశాన్ని సందర్శించిన మొదటి బ్రిటిష్ రాణి




యునైటెడ్ కింగ్‌డమ్‌కు చెందిన రెండవ ఎలిజబెత్ మహారాణి 1954, ఫిబ్రవరి 3 వ తారీఖున ఆస్ట్రేలియా దేశాన్ని సందర్శించారు. దక్షిణార్థ గోళంలో ఆ దేశాన్ని సందర్శించిన ఏకైక రాణి రెండవ ఎలిజబెత్ మహారాణి.

## కన్‌కార్డ్ విమానం తొలి ప్రయాణం

తొలిసారిగా బ్రిటన్‌లోని బ్రిస్టల్ ప్రాంతానికి చేరువలోనున్న ఫిల్‌టన్ నుండీ కన్‌కార్డ్ 002 విమానం తన ప్రయాణాన్ని ప్రారంభించింది. ఇది 1969 ఏప్రిల్ నెల 9వ తారీఖున జరిగిన సంఘటన. ఆ విమాన చోదకుడి పేరు బ్రియన్ ట్రుబ్‌షా (Brian Trubshaw)

## శుక్రగ్రహంపై దిగిన చోదకులు లేని అంతరిక్ష నౌక

సోవియెట్ యూనియన్‌కు చెందిన శాస్త్రజ్ఞులుచే తయారుచేయబడిన వీనస్ 3 అంత రిక్ష నౌక శుక్రగ్రహంపై 1966, మార్చి 1 వ తేదీన దిగింది. ఈ అంతరిక్ష నౌకలో చోదకులు అసలు లేరు. అదే ఈ నౌక

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

క్విజ్:- 1. (సి) విటమిన్లు, 2. (ఎ) వజ్రం, 3. (డి) తమిళనాడు, 4 (బి) బాలల దినోత్సవం, 5 (సి) బెన్ కింగ్స్‌లే, 6. (ఎ) చట్టాలను వ్యాఖ్యానించడం, 7. (సి) జాతీయ విశ్వాస భావం, 8. (ఎ) శుక్రగ్రహం.

మాటల మహిమ: 1. (ఎ) మందు, 2. (బి) గడ్డి, 3. (సి) బొక్క, 4. (డి) విచారపడు, 5. (సి) తప్పు, 6. (డి) సేమ్య, 7. (బి) కొంగ, 8. (ఎ) నాలుగు.

తెలివికి పరీక్ష: 1. ఒక కిలో ఈకలు, 2. (డి) హెూబార్ట్ - ఇది తాస్‌మానియా (ఆస్ట్రేలియా)కు చెందినది, 3. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఏకైక పుత్రిక ఇందిరా గాంధీ, 4. సున్న విలువ లేనిది కాబట్టి 0/0 = 1 అని భావించలేము, 5. మెసపొటామియా.

"మానవత్వంతో ఉండాలంటే పశుత్వం లేదా క్రూరత్వం విసర్జించాలి. ఇది పూర్తిగా అవగాహన చేసుకున్నప్పుడే మానవ ప్రవర్తన వెల్లడవుతుంది."

## మూడు దళాలకు చెందిన యువకులకు సైనిక శిక్షణనిచ్చే ఏకైక శిక్షణాకేంద్రం

మహారాష్ట్రకు చెందిన పూనే ప్రాంతంలో ఖడక్‌వాస్‌లా నేషనల్ డిఫెన్స్ అకాడమీని 1955, జనవరి 16 వ తారీఖున స్థాపించారు. అప్పటిలో మూడు దళాలకు సైనిక శిక్షణను ఇవ్వగలిగిన శిక్షణాకేంద్రం ప్రపంచంలో అదే మొదటిదిగా ఉండేది. ఇక్కడ సైనికదళం, నౌకాదళం, విమానదళంకు చెందిన యువకులకు సంయుక్తంగా సైనిక శిక్షణను ఇస్తారు.

## ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన మొట్టమొదటి మహిళ

కుమారి బచేంద్రిపాల్ ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన ప్రప్రథమ భారతీయ మహిళ. ఈమె ప్రస్తుతం జెమ్‌షెడ్‌పూర్ (బీహారు రాష్ట్రం) లో టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీలో పనిచేస్తున్నది. 1984, మేనెల 23 వ తారీఖున ఆమె అత్యున్నత శిఖరమైన ఎవరెస్టును (నేపాలు దేశానికి చెందిన హిమాలయ పర్వత శ్రేణి) అధిరోహించింది. ప్రపంచం మొత్తంలో ఈ విజయాన్ని సాధించిన నాలుగవ మహిళగా ఈమె గణుతికెక్కింది.

## అతి సుందరంగా నేయబడ్డ

రాజస్థాన్‌కు చెందిన బికనీర్ ఉలన్ మిల్స్ వారు 1986 లో ప్రపంచంలోని అతి సుందర మైన తివాచీను నేసారు. ఒక చదరపు సెంటీమీటరుకు ఈ తివాచీలో 403 ముడులు ఉన్నాయి. 46 సెం.మీ. × 53 సెం.మీ.లు ఉన్న ఈ తివాచీపై హిమాచల్ ప్రదేశ్‌వారి 'కాంగ్రా' పెయింటింగు నేయబడ్డది. ఈతివాచీ నేతపనికి సుమారు రెండు సంవత్సరాల కాలం పట్టింది.

## అత్యంత వ్యయభరిత, మానవ రహిత వ్యోమశకటం




*కీర్తిశేషుడైన అమెరికన్ వ్యోమగామి ఎడ్విన్ పి. హబ్బుల్ పేర నిర్మితమైన 1.5 బిలియన్ డాలర్ల, 11,000 కేజీల, 13 మీటర్ల పొడవు గల హబ్బుల్ వ్యోమశకటం - నేషనల్ యారోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్ (యునైటెడ్ స్టేట్స్) అంతకు ముందెన్నడూ నిర్మించని మానవ రహిత, అత్యంత వ్యయ భరితమైన వ్యోమశకటం.*

"హాని జరిగిన తరువాత సలహా ఇవ్వటం - మరణానంతరం మందు ఇవ్వటం వంటిది."
— డానిష్ సూక్తి